కళాభివర్ధన గ్రంథమాల. 3.

# సాహసిక రాజపుత్త్రము.




ఇది

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి ప్రణీతము.

మొదటి కూర్పు.

రాయవరము.

శ్రీ భారతీ తిలక ముద్రాక్షర శాల యందు నల్లమిల్లి సత్తిరెడ్డి గారిచే ముద్రింపఁబడి గ్రంథకర్త గారిచేఁ బ్రకటింపఁబడియె.

౧౯౨౩.

 [వెల రు ౦-౬-౦ లు.

# భూమిక.

వీర రస పరిప్లుతములగు గ్రంథములను జదువుట యందును వ్రాయుటయందును నా కభిలాష మెండు. ఉదయపుర సంస్థానము వారి చరిత్రములు వీర రస పూరితములు. భండారు అచ్చమాంబగారు వ్రాసిన అబలా సచ్చరిత్రమాలం జదువుచుం బతి మరణానంతరము రామాబాయి చూపిన శౌర్య సాహసముల కచ్చెరువడి నే నీకథ నందందు మార్పులు గావించి ౨౬-౨-౧౯౧౧ తేదీ రాత్రి ౮ గంటల కారంభించి ౧౮-౬-౧౯౧౧ తేదీ రాత్రి ౯ గంటలకు రూపకముగ వ్రాసి ముగించితిని. కొన్ని యనివార్య కారణములచే నిది వ్రాయుట కింత కాలము పట్టెను. లజ్జాకర మగు ఘోషా పద్ధతికిలోఁ బడపక విద్యాలంగడపిన నబల లెంతటి వారగుదురో యీ చరిత్రము వలనఁ దెలిసికొన వచ్చును. పురుషులకు వలెనే స్త్రీలకు విద్యా స్వాతంత్ర్యము గలదు. ఇది మన హిందూ మత ధర్మమునకు విరుద్ధాంశము గాదు. స్త్రీలు పురుషుల కర్థాంగలక్ష్ము లను మాట యందీయర్థము విస్పష్ట మగు చున్నది. రామాబాయి వంటి కాంతామణుల చరిత్రము లభ్యున్నతి నందవాంఛించు చున్నయాంధ్ర సోదరీమణుల కవశ్య పఠనీయములు. ఇందలి పద్యములు కొన్ని రామదేవ విజయమునఁ జూపట్టు. అవి యిందలివే. కాని సందర్భము ననుసరించి యందును వ్రాసితిని. మఱియు నిందటనట లక్షణోల్లంఘనము గావించి యున్నాఁడ. నాసాహసమును సైరించుటకును నిందితర దోషము లేమైన నున్న వానిని మన్నించుటకును బండితులను బ్రార్థించు చున్నాఁడ.

౧౯-౩-౧౯౧౩. <br>
పాలమూరు, గోదావరి జిల్లా.

ఇట్లు,<br>
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి.

## తప్పొప్పుల పట్టిక.

| పుట. బంతి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| ౧-౧౪ | నాఁడ | నాడ |
| ౨-౭ | క్షత్రియుల | క్షత్త్రియుల |
| ౫-౧౦ | నచ్చట | నిచ్చట |
| ౧౪-౧౦ | వోయెనేనిని దివమ్ము | వోయెనేనిఁది దివమ్ము |
| ౧౭-౧౩ | క్షాత్ర | క్షాత్త్ర |
| ౨౧-౧౪ | పరివేపిత | పరివేష్టిత |
| ౨౨-౬ | ల్లతంబోలి | ల్లతలఁబోలి |
| ౨౪-౪ | భటుఁడయు | భటుఁడయ్యె |
| ,,-౮ | భంగురమైన | భంగురమ్మైన |
| ౩౩-౧౫ | రిపుసైన్యము | రిపుసైన్యము |
| ౩౪-౨ | వాహినిలిపు | వాహిను లిపు |
| ,,-౭ | మేపారగ | మేపారఁగ |
| ౩౫-౩ | ఈ సమస్థానము | ఈ సంస్థానము |
| ౩౬-౨౪ | క్షత్రియ | క్షత్త్రియ |
| ౩౯-౨ | యవనీశ్వరు | యవనేశ్వరు |
| ,,-౧౧ | నీకు శక్య మగునె | మీకు శక్యమగునె |
| ౪౧-౧౮ | ఆత్మశ్లాఖా | ఆత్మశ్లాఘా |
| ౫౦-౪ | క్షాత్ర తే | క్షాత్త్ర తే |
| ౫౬-౪ | కొఱ | కొఱఁ |
| ౬౦-౨ | రస | న్నో రస |
| ,,-౧౩ | పూరుషుం బలె | పూరుషుం బలెనె |
| ౬౯-౧౬ | పోరఁగ | బోరఁగ |
| ౭౨-౧౮ | పోరి పడినివి | పొరపడితివి |

ఇంక నందందు స్ఖాలిత్యములున్న దిద్దికొనఁ జదువరులు ప్రార్థితులు.

# ఈ నాటకమున వచ్చు పాత్రములు.



## పురుషులు.

జగ మల్హాసో రాజు.

వాచస్పతి.

శివ కుమారుడు.

రామ సింగు.

అక్బరు.

మాన సింహుడు.

## స్త్రీలు.

రామా బాయి.

చంద్రావతి.

లీలావతి.

ఇంతను సందర్భాను సారముగ రాజ పుత్ర యోధులు రాజ పుత్రింతలు మహమ్మదీయ సైనికులు సేవకులు మున్నగువారు ప్రవేశింతురు.




శ్రీ రస్తు.

# సాహసిక రాజపుత్త్రిము.

## ప్రథమాంకము.



### నాంది.

మ. జలకేళిన్ బువ్వుఁదోఁట లందును శరచ్చాంద్రీ విహారమ్ములన్
బాలయల్కన్ వగగుల్కు నంతిపురియందున్ మాత్రమే గాక ని
స్తులుఁడౌ కృష్ణునకున్ రణాంగణమునందున్ సైత మర్థాంగియౌ
నల సాత్రాజితి సాహసక్రియలు మీ కానందమున్ గూర్చుతన్.

( నాంద్యంతమున )

సూత్రి—( ప్రవేశించి ) ఓ సభాసదులారా!

మ. ఘనసామ్రాజ్యము వైరి పాలగు గతిన్ గాన్పించినన్ దాలిమిన్
దనకుం గూరిమి వేలు పైన పతి యానన్ మీఱకే ఘోరమౌ
రణమున్ జేసి కులాభిమానమును సంరక్షించుకొన్నట్టి కా
మిని చారిత్రము నేఁడుఁ బూనితిమి కూర్మిన్ మీర లీక్షింపుఁడీ.

మారిషుఁడు—( ప్రవేశించి ) బావా! ఎన్ని యిక్కట్టులు వాటిల్లినను ధైర్యమును వీడక పతి యాజ్ఞ చొప్పున సంగ్రామము గావించి కుల మర్యాదను రక్షించుకొనిన యా కాంతామణి పేరేమి? ఆమె చరిత్రమును రూపకముగ విలిఖించిన కవి యెవఁడు?

సూత్రి—మారిషా! మఱచితివా? ఆ మానవతీ శిరోమణి రామాబాయి. "సాహసిక రాజపుత్త్ర" మను పేర నామె చరిత్రమును శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి రూపకముగ లిఖించెను. అదియే మన మిప్పుడు ప్రదర్శింపఁ బోవునది.

మారి—బావా! మంచి కథ నరసితివి. నిర్మల శౌర్యవంతులగు నుదయపుర క్షత్త్రియుల చరిత్రములు ప్రదర్శనీయములు!

సూత్రి—మారిషా! నిజము పల్కితివి. సిసోదియా వంశము వారి శౌర్యము నిష్కళంకమైనదే. వారు—

గీ. అని నలుప రాఁగ రిపుల డీకొను టె గాని
యెడఁద భీతిల్లి వెను దీయు టెపుడు లేదు
పగఱఁ గూల్చుటయో తాము పడుట గాని
పోరఁ జాలక పాఱిపోవుటయు లేదు.

మారి—అదేమి పుణ్యమో కాని సిసోదియా వంశమునఁ బ్రభవించిన స్త్రీ పురుషులలో శౌర్య హీను లొక్కరును గాన్పింపరు. సాహచర్యవశమున నుదయపుర రాజ పుత్త్ర వీరులను వరించెడి కాంతామణులు సైత మట్టి శౌర్య ధైర్య సాహసముల చేతనే వెలుంగుచున్నారు. పతి మరణా నంతరము రామాబాయి చూపిన శౌర్య సాహసము లత్యద్భుతములు గదా?

( తెరలో )

దేవా! సిసోదియా వంశ క్షీర పారావార రాకా సుధాకరా!

మ. మనమం దెంచిరి పాంచ భౌతిక శరీర మ్మస్థిరమ్మంచు, శౌ
ర్య నిరూఢిన్ జనినారు మానము నెదన్ బ్రాణమ్ముగా నెంచి, భూ

జనులం బుత్త్రుల మాడ్కిఁ గన్గొనిరి యుష్మద్వంశ్యు లీ నష్వరా
తన భూపాలురు; వారి త్రోవఁ జని ప్రోద్యత్కీర్తి నార్జింపుమా.

సూత్రి—(ఆలకించి) మారిషా! అదే జగమల్లసాహరాజు కొ
లువు దీర్చినాఁడు. ఇఁక మన మిట నుండరాదు. పోదము రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

శ్రీ ర స్తు.

# సాహసిక రాజపుత్రీయము.

## ప్రథమాంకము.

[ కొలువు కూటము ]

( జగమల్ల మహారాజు, వాచస్పతి, పరివారము ప్రవేశింతురు )

జగ—వాచస్పతీ!

వాచ—మహా ప్రసాదము స్వామీ!

జగ—ఈ యవనుఁడు మన పురము చెంత విడియుటకుఁ గారణ మేమై యుండును?

గీ. మొనసి చిత్తూరు కోటను ముట్టడింపఁ
దలఁచి వచ్చెనో; పరులను గెలిచి కొనఁగఁ
జనుచు మన వీటి కడఁ బథ శ్రాంతి తొలఁగఁ
జేసికొన నిల్చెనో కో; యోచింపుమయ్య!

వాచ—దేవా! దిల్లీశ్వరుండగు నా యగ్బరే శత్రు భూపాలు కోటనో ముట్టడింప నీ త్రోవం బోవుచు మార్గాయాసము వోవ మన పురము బైట విశ్రమింప విడిసి యుండును. అంతియే గాని మనతో బోర వచ్చినట్లూహింపఁదగదు. ఏమన?

గీ. చెలఁగి చిత్తూరు సీమునాన గెలుతు మనుచుఁ
దలఁచి పౌరుష లవ దుర్విదగ్ధుఁ డగుచుఁ

బలువుగ తనుమ్ము లొసఁ దెంచి గెలువ లేక
పాఱిపోయిరి మఱల నెవ్వాఁడు వచ్చు?

అట్లు గాక, యే మూర్ఖుఁడైన సఖర్వ గర్విత చిత్తుఁడై స్వ పర బల తారతమ్యము నెఱుంగక చిత్తూరు కోటను ముట్టడించె నేని,—

గీ. కరము నావేశ మొప్ప నొక్క నిమిషమ్ము
పోరి మనతోడ ఖడ్గమ్ము బుడమి విడిచి
శరణు వొచ్చుటో. యోడుటో, చావుఁ గనుటొ
గాక వేఱొండు పనిఁ జేయఁ గలఁడె యధపు!

జగ—నరియే. ఎచ్చటికో పోవుచు నచ్చట విడిసినచో వానితో మనకుఁ బని యేమి లేదు. అట్లుగాక,—

చ. స్వపరబలాబలక్రమ విచార వివేక విహీనుఁడై చు స
చ్చపలుఁడు నన్ను మారుకొని సంగరముం బొనరింప వచ్చినన్
విపులతరారియోధ తతి భీతిలి యోడఁ బరాక్రమించి శౌ
ర్యపటిమమీఱ నయ్యధము నాహవరంగమునందుఁ గూల్చెదన్.

దీనికేమి గాని వాచస్పతీ! తొలుత శత్రునకిట్లు తెలియఁ జేయుము.

చ. విడియుట కేమి కారణము వీటికిఁ జెంగట మూఁడు నాళులం
బడయక యే; తమార్పణము బల్కఁగ వత్తువొ తప్పు జేయుటన్
గడు వడి లేచి పోయెదవొ గౌరవ మింత నశింపకుండ; నీ
యడఁదను గల్గినట్టి తలఁపేమొ యెఱుంగఁగఁ జేయుమీ వెసన్.

వాచ—చిత్తము, ఎవఁడురా అక్కడ? (ద్వారము దెసఁజూచి) ఓరీ! అట్లు కళవళ పడెదవేమి?

సేవకుఁడు—(ప్రవేశించి) దేవా! ఏమి చెప్పుదును? తురగలు యుద్ధమును సూచించు ధ్వజము నెత్తినారు!

జగ—ఏమీ? ధ్వజము నెత్తినారా! వాచస్పతీ!

గీ. ఎవనినో గెల్చుకొనుటకు నేగుచుండె
ననుచు నూహించుకొను చుంటిమయ్య! మనము
కాని యీ మూర్ఖుఁ డరుదెంచె గర్వమెనఁగ
మొనసి చిత్తూరు కోటనే ముట్టడింప.

ఏమీ? ఆ యవనాధముఁ డెంత సాహసించెను!

సీ. త్రుక్కి మార్గాన లేక సుత నిచ్చిన విహారి
మల్లుఁ డటంచు నెమ్మదిఁ దలఁచెనో
సంగరమ్మునఁ బోరఁ జాలక శరణన్న
మాల్దేవుఁ డనుచుఁ దా మదిఁ దలఁచెనో
సిగ్గించుకయు లేక చెల్లెలి నొసఁగిన
మానసింహుఁ డటంచు మదిఁ దలఁచెనో
శౌర్య మింతయు లేక శరణని బ్రతికిన
మనుజనాథు లటంచు మదిఁ దలఁచెనో

గీ. మానమే ప్రాణముగ నెంచి మసలువాఁడు
పగతుఱం గెల్వఁగాఁ జాలు బాహుబలుఁడు
ధైర్యధుర్యుఁడు నిస్తుల శౌర్యయుతుఁడు
నైన జగమల్లుహారా జటం చెఱుఁగఁడో.

కానిమ్ము. ఆ యవనాధముఁడు వీరాధివీరుఁడగు నీ జగమల్లుహారా యొక్క యసమాన భుజాబలమును జవి జూచుఁ గాక.

( తెరలో. )

ఓ భటులారా!

గీ. గుసగుసలు వోదు రేటికి గుంపు గూడి
యవనుఁ డని సేయ వచ్చిన యంత మాత్ర

క్షత్రియుల దాఁకి పోరాడి జయము గాంచి
స్వపురమును జేసునే నాఁడు ప్రాభవమును!

జగ—( ఆలకించి ) ఓహో! సమయమున కల్లదే మేనాడు రా లక్ష్మి వచ్చుచున్నది!

( అప్పుడు రామాబాయి ప్రవేశించుచున్నది )

జగ—ప్రాణేశ్వరీ! వచ్చితివా? ( అని యర్ధాసనమునఁ గూర్చుం బెట్టుకొని ) దేవీ!

మ. రజనీనాథ పతాకుఁడైన యగబర్త్యాధుఁ డెంతేనియుఁ
ద్రిజగద్వీరుఁడ నంచు శౌర్యలవ వక్రీభూత చేతస్కుఁడై
విజయోద్ఛుఁ మన కోట ముంగట మరిఁ భీతిల్ల కావంతయుఁ
గజపద్గాది బలమ్ముతో విడిసె నో కంజాక్షి! వీక్షించితే?

రామా—ప్రాణేశ్వరా! వినియునింమ. సంగ్రామమన్న మనము
వెఱతుమా?

జగ—వెఱచుటా? దేవీ!

ఆ. వె. ధరణి దిరుగుఁ గాత శరధు లింకును గాత
దరణి చంద్ర గతులు తప్పుఁ గాత
మెట్టి యుద్ధమైన నెట్టి శత్రుండైనఁ
బోర వెఱవ సుమ్ము పొలఁతి నేను.




అదియును గాక, ఓ శూర నారీ రత్నమా!

ఉ. వీరరస స్వరూపమున వెల్గెడి నీకు సహాయమేమి? వి
స్తార భుజా బలాఢ్యులగు సైనికు లెందఱో కల్గులేమి? ధీ
వారిధియైన మంత్రియు సభంగుర దుర్గము గల్గులేమి? నేఁ
జేరి విరోధులన్ రణము సేయఁగ భీతిలు టేమి కామినీ!

ఇఁక నిట్లాలోచించుకొనుచుఁ గూర్చుండ నేల? మంత్రివర్యా! అతి రభసమ్మున నీ వఱిగి సౌరంగములయందును, సోరణగండ్లయందును, నగడ్త తిరుగుళ్లయందును, బురుజుల మీఁదను గల సైనికులను గడుజాగరూకతతో నుండ నియమించి, తక్కంగల సైన్యమును సర్వ సిద్ధము సేయునట్లు సదాశివరాయని కనుజ్ఞ యిమ్ము. పరశు పట్టిస కుంత తోమర భిండివాల కరవాలాదులకుఁ బదను పట్టుటకును బాణములకుఁ జికిలి చేయుటకును గమ్మరీంద్ర కనుజ్ఞ యిమ్ము. తక్కంగల సాంగ్రామిక సాధనముల నన్నింటిని సిద్ధము సేయింపుము.

వాచ—చిత్తము.

రామా—నాథా! నేనంతయు నాయత్తపఱచి వచ్చియుంటిని. కావున మీరు మఱల నందులకుఁ బ్రయత్నింప నక్కఱలేదు.

జగ—(సంతోషముతో) దేవీ! ఇదివఱకే నీవు సర్వ సన్నాహం బొనరించి వచ్చితివా? ఆహా! వాచస్పతీ!

గీ. సేనలను సర్వ సిద్ధము సేయవలయు
నంచు నూహించుకొనుచుంటి నయ్య! మనము
కాని యుంటిమి మున్నె యీ కర్జ మెల్లఁ
జేసి నా దేవియే చక్కఁ బెట్టి వచ్చె.

ఇయ్యది మనకు శుభసూచకము సుమా! ఇఁక శత్రువెంత బలవంతుఁడైనను నెట్టి యుద్ధమైనను మనకు జయము గలుగు ననుటకు సందేహమేమి? ఓ నా పాలింటి భాగ్యదేవతా! మేవాడు రాజ్యలక్ష్మీ!

ఆ. వె. ధరణి నిన్ను బోలు తరళాక్షి సతియైన
జనున కేదియే నసాధ్యమగునె?
అగ్నిఁ బట్టి బంతి యట్లాడఁగా వచ్చు
గొండఁ బిండి గాఁగఁ గొట్టవచ్చు.

## ప్రథమాంకము.

(తెరలో)

ఏమీ! దేవ బ్రాహ్మణ గో హింసా పరతంత్రుఁడగు మ్లేచ్ఛుఁడు మేవాడు రాణా వారి కోటలోఁ బ్రవేశింపఁ గోరుచున్నాఁడా?

జగ—(ఆలకించి) ఏమిది? (ద్వారము దెసఁ జూచి) ఎవఁడురా అక్కడ?

సేవకుఁడు—(ప్రవేశించి) దేవా! ఒక తురుష్కుఁ డరుదెంచి తమ దర్శనము కొఱకు ద్వారము కడ వేచి యున్నాఁడు.

వాచ—దేవా! అక్బరు రాయబార మంపినట్లు తోఁచుచున్నది.

రామా—చేతనైనచో యుద్ధ ప్రారంభ సూచకముగ రణ భేరిని మ్రోయింపక రాయబారి నంప నేటికి? న్యాయ మార్గ సంచారి యనిపించుకొనుటకుఁ గాఁబోలు! నాథా! ఆ యవనుని రప్పించెదరా?

జగ—రప్పింపక పోనేల? ఎందుల కేతెంచెనో తెలిసికొనుట లగ్గుగాదా? సేవకా! ఆ యవనునిఁ ద్వరగఁ బ్రవేశపెట్టుము.

సేవ—చిత్తము.

(అని నిష్క్రమించి వెంటనే తురుష్కునితోఁ బ్రవేశించి)

వారే మహారాణావారు. (అని చూపును)

తురుష్కుఁడు—సలాము రాజా!

జగ—సంతసంబాయె. అట నాసీనుఁడ వగుము.

తురు—(కూర్చుండి) రాజా! సేమమే గద?

జగ—మాపై మీకుఁ గల మహా కటాక్షమునకు సంతసించితిమి!

రామా—మేవాడు ప్రభువులకును మహమ్మదీయులకును నీ స్నేహమెప్పటి నుండియో!

వాచ—ఓయీ! వెఱ్ఱి పోకడలకుఁ బోక నీ రాకకుఁ గారణ మేమో యెఱింగింపుము.

తురు--మీరు తొందర పడు చున్నారు. ఫాదుషాగారు యిప్పుడు లక్ష సిబ్బందితోఁ జైత్ర యాత్ర సేయ వచ్చినారు.

రామా--ఈ లక్ష సిబ్బందియుఁ బిట్టలను గొట్టుటకేనా?

తురు--పిట్టలను గొట్టుటకో, దిట్టలను గొట్టుటకో.

జగ--ఓయీ! నీ చౌర్యము ధౌర్త్యముగఁ బరిణమించుచున్నది. జాగ్రత్తసుమా!

తురు--జాగ్రత్తయే లాభ దాయకము. త్వరపడిన లాభము లేదు. ఎల్లఱు జాగ్రత్తగా నుండవలసినదే. ఫాదుషా వారి సందేశము నాలింపుఁడు. "మా సార్వభౌమత్వము నంగీకరించి, మా సామంతులరై, యేటేటఁ గప్పము సెల్లించు చుండవలెను. లేకున్న యుద్ధమునకు సిద్ధముగా నుండుఁడు"

నాచ--ఇంతియేనా నీ రాజు నాదేశము?

తురు--ఇంతియే. మీ యభిప్రాయమేమో ఫాదుషా వారికిఁ ద్వరగఁ దెలియఁ జేయుఁడు. నాకు సెలవొసంగుఁడు.

జగ--పోయిరమ్ము.

రామా--అక్బరు నాదేశమును యథా నిర్దిష్టముగ నెఱవేర్చిన నీవు సన్మానింపఁ బడుదువు గాక!

(తురుష్కుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

జగ--వాచస్పతీ! చూచితివా తురుష్కుని సాహసము! వీని చక్రవర్తిత్వము సంగీకరించి యేటేట మనము కప్పము చెల్లించు చుండ వలెను గా!

గీ. మనము శౌర్య హీనుల మంచు మదిఁ దలఁచెనొ
ఓరి భారత వీరుల నాహవమునఁ

దునిమి కోటఁ జేకొను టెంత యని తలఁచెనో
ఎంత సాహస మొనరించె నెడఁదఁ దురక.

దేవీ! వీని బెదరింపులకు జంకి పోరఁ జాలక మనము కప్ప మిచ్చెదమా?

రాణా—హృదయవల్లభా! ఏమంటిరి? మన మక్బరునకుఁ గప్ప మిచ్చెదమా?

ఉ. ఎంతటి మాట బల్కితి రిసీ! యవనుం డన నెంత? దుర్భరా
నంత పరాక్రమక్రమ సమన్విత సైన్యము గల్గి; వాని సా
మంతులమై యెడంద నభిమాన మొకింతయు లేక తత్పరా
క్రాంతులమై చరించెదమె కప్ప మొసంగి చితూరు కోటలోన్.

జగదేకవీరుఁడగు బాప్పారావలు వంశమున నుదయించి మానధనులగు ఖుమాన్ సమరసింహ, భీమసింహ, లక్ష్మణ సింహ, క్షేత్రసింహ, మోకల్ రాణా, కుంభరాణా, రాయమల్ల సంగరాణా, రత్నసింహాది మహా వీరాధి వీరులచేఁ బరిపాలింపఁబడి కులక్రమ లబ్ధమగు మేవాడు రాజ్యమునే పాలించుచు యోధాన యోధులని పేరు వడిసిన మీరేమి తురుష్కునకు సామంతులగుటేమి? కప్ప మీయకున్న యుద్ధము సేయునా? సేయుఁ గాక.

గీ. అరయ వాఁడెంత? వాని సైన్యం బదెంత?
మొనసి చిత్తూరు కోటను ముట్టడించి
మనల నోడించి కప్పమ్ము గొని స్వపట్ట
ణాభిముఖుఁడై యసుఁజు తోడ నరుగఁ గలఁడె?

జగ—దేవీ! ఔను. సిసోదియా వంశము వారు ప్రాణమునే కన్న మానమునే యెక్కుడుగఁ దలంచువారు. అట్టి సత్కులమునఁ బుట్టినే నేల కుల మర్యాదను దప్పెదను?

మత్తకోకిల.

వీర వంశమునం జనించితి వీరవర్యుఁ డటంచు నేఁ
బేరు గాంచితి; వైరి మార్గుని వీఁకఁ బోరెదఁ గాని యా
పేరు మాఱ రణమ్ము సేయఁగ భీతిఁ జెంది విరోధికిన్
గోరు కప్ప మొసంగి వానికిఁ గొమ్మ! పోషుఁడ నౌదునే?

మనము భయపడెద మని కాఁబోలు పాదుషా లక్ష సిబ్బందితో దండెత్తి వచ్చె ననినాఁడు! మంత్రీ! మన సైన్యమెంత?

వాచ—దేవా! మన సైన్యమా! ఎనుబది ఫిరంగులు. అవి గాక నాలుగు వేల యేనుఁగులును, బది వేల గుఱ్ఱపు దళమును, బదునాఱు వేల కాల్బలమును మొత్తము ముప్పది వేలు మాత్రమే.

జగ—అద్దిరా! రిపు సైన్యము మన సైన్యమున కంటె రెండు రెట్లధికముగ నున్నదే! అబ్బా! వాచస్పతీ! ఈ కొలఁది సైన్యముతో మన మా యవనుని గెలువ గలమా?

వాచ—దేవా! అదెంతపని? ఆ యవన సైనికు లెల్లను నలీక శూరులే సుఁడీ! లక్ష మంది సైనికు లుండుటే వైరి వాహిని పరాక్రమ శూన్యమని తెలియు చున్నది.

ఉ. యవనుని సైన్య మెంతయిన నయ్యెడఁ గావుత మైన నేమి? యా
హవ మొనరింపఁగాఁ దొడఁగు నప్పుడు చూతురు గాత రాజపు
త్త్ర వర చమూ నికాయ బల ధైర్య పరాక్రమ శౌర్య సంపదల్
వివరముగా; విరోధి పృథివీ పతి సైన్యము మట్టు పెట్టదే?

రామా—జీవితేశ్వరా! మన సైన్యము స్వల్పమని శంకించు చుంటిరా? అట్లైన్నటికిని శంకింప వలదు. ఏఁటన?

గీ. అహిత సైన్య మదెంతైన నగును గాత.
వగాహవమ్మున మనకు లోఁగుట నిజము,

కనఁగఁ గడవంత గుమ్మడి కాయ చిన్న
కత్తి పీటకు లోకువగుఁ గాదె నాథ!

జగ—ఔనౌను. ఓశూరనారీరత్నమా! చక్కఁగాఁ జెప్పితివి.

చ. కుధర నిభమ్ములై జనులకుం గడు భీతిని గొల్పునట్టి వా
రిధి జనియించు వీచు లవలీలఁ దుకాతుకలై చనంగ న
మ్మథన నగంబు పోలిక నమందగతిన్ జరియించు నోడ నం
బుధి నడుమన్ బుడుంగు మని ముంచెడిఁ గాదె రవంత రంధ్రమే.

అదియునుఁగాక, కొలఁది మందియే యైనను మన సైనికులు,—

గీ. మానమే ప్రాణముగ నెంచి మసలు వార
లెన్న నాయెడ భయ భక్తులున్నవారు
వీరు లాహవ శాస్త్ర ప్రవీణు లహిత
సముదయముఁ జక్కఁ జేసెడి సాహసికులు.




అదట్లుండ,—

ఉ. ఆహవమందు శాత్రవుల యగ్గలికమ్మున కోపకే, నిరు
త్సాహతఁ బాటిపోవు నిజ సైనికులం బరువెత్తనీక ప్రో
త్సాహము గల్గఁ జేసి కడు శౌర్యము గొల్పి విరోధి సేన నీ
వోహటిలంగఁ జేసెద వహో యని వీరులు సన్నుతింపగన్.

నీవు ప్రోత్సహించిన మేకయైన బెబ్బులి యగును. అట్టి నీవు చెంత నుండ సైన్యమెంత స్వల్పమైన నేమి? సైన్యము సంగతి యట్లుండనిమ్ము.
ఓ గంధ సింధుర రాజగమనా!

ఉ. అగ్ని శిఖా నిభమ్ములగు నాయుధముల్ ధరియించి యుద్ధసం
లగ్న మనమ్మునుం గని వెలందిరో! మంత్రియు నీవు నేను ద్రే
తాగ్నుల భంగి నొప్పుచు నహంకృతితోఁ గదనం బొనర్చుచో
భగ్నము సేసి వైరి మరి పార్థివ శుష్కచమూ మహాటవిన్.

వాచ—మహారాజా! మీకు మే మంగళమును గావలయునా? మీరు రణరంగమున నిలువ మఱల నెవ్వఁడైనఁ జేత ఖడ్గము ధరింపఁ గలఁడా?

జగ—వాచస్పతీ? నేను సమర్థుఁడనో యసమర్థుఁడనో, సమర్థుఁడైనను నసమర్థుఁడైనను బ్రయత్నము సేయుట మనుజునకు విధి. "యత్నే కృతే యది న సిధ్యతి కోఽత్ర దోషః" యని మనలో నొక సూక్తి కలదు గదా? నా చేతనైనంత దనుకఁ బోరెదఁ గాని వెనుదీయను.

ఉ. ప్రాణము నిల్చెనేని నగబర్బరపాలుని మట్టు వెట్టి, ఢి
ల్లీని వశమ్ము సేసికొని లీలగ నేలెద నెల్లరాజ్యముల్
బ్రాణము వోయెనేని ద్రిదివమ్మును జేరి సురేంద్రుఁ ద్రోసి, మే
లౌ నని దేవతల్ వొగడ నా సురరాజ్యము లీల నేలెదన్.

రామా—వహవా! నాథా! అదియే పౌరుషము! చావున కిన్ని చావులు లేవు గదా? క్షణభంగురములగు తనువుల కాశపడి మేవాడు రాజ్యాధీశ్వరులు పౌరుష శూన్యులని పెద్ద దూఱు వడయ నేల?

జగ—దేవీ! పౌరుషము కంటెఁ బ్రాణము గొప్పదే? పౌరుష హీనుండై బ్రతుకుట కంటెఁ జచ్చుట మేలు. అప్రతీప ప్రతాపుఁడ నయ్యాసాటె వానికి సామంతుఁడనై యుండనేల! పర రాజునకు సామంతులై యుండుట కన్న సిసోదియా వంశము వారి కపకీర్తి గలదా? యుద్ధము సేసెద. పగతుని గెల్చెద. లేకున్నఁ జచ్చెద. అంతియే గాని యుత్తమ క్షత్రియుఁడనైన నే నక్బరునకు సామంతుఁడ నగుటకు సమ్మతింపను. ఉత్తమ క్షత్రియ కుల సంజాతునకు యుద్ధమునకుఁ బోవుట పెండ్లికిఁ బోవుట వంటిది.

వాచ—నిజము నిజము. సంగ్రామము సేసినఁ బ్రజలకు నలుగుడు గలుగునని సందేహించుచుంటిమి గాని మనము మాత్రము పోర వె

ఐతేమూ? గెల్చి రావలె, చచ్చి పోవలె.

జగ—సంగ్రామము సేసినఁ బ్రజలకు నలుగును గలుగునా? అబద్ధము. మన మిప్పు డక్బరునకు సామంతుల మైనచో నిజముగ మన ప్రజలకు మనమే యిక్కట్టులు గలిగించిన వార మగుదుము. మహమ్మదీయ ప్రభుత్వము నందలి హిందూ ప్రజ లనుభవించుచున్న సౌఖ్యములను జూచుచుంటివి గదా?

సీ. అవిలంఘ్యమైన మతాచారమునకు జు
ట్టుంచుకొన్నను గప్ప మొసఁగ వలయు
నాజాతి యీజాతి యనక గో మత్స్యాది
పలల మెల్లను భుజింపఁగ వలయును
నెంత గౌరవమున్న హిందువైన గులాము
నకును వంగి సలా మనంగ వలయు
విగ్రహారాధన విడిచి మసీదులఁ
దివిరి యల్లాను బ్రార్థింపవలయు

గీ. వైభవము మీఱఁగా నుత్సవములఁ జేసి
కొన వలను గాదు, కృషి సేసికొని సుఖమ్ము
నొందఁగా రాదు, యవన ప్రభుత్వమందు
హిందువులు గాంచు సౌఖ్యమ్ము లివియ సుమ్ము.

రామా—వాచస్పతీ! ముఖ్య విషయ మింకొకటి గలదు.

మ. అకటా! చెప్పఁగ నోరు రాదు నిజ గేహమ్ముల్ బెడంబాసి వీ
థికి నేతెంచెడి హైందవాంగనను బాతివ్రత్య సమ్మానితన్
వికచాంభోరుహపత్ర నేత్రఁ గని వెన్వెంటన్ రవంతైన నం
జిక లేకే కొని పోవుచుందు రకటా! చెన్నొంటులై మొగలుల్.

జగ—ఔనౌను. ముఖ్య విషయమే యిది. మంత్రీ! మహమ్మ

దీయ ప్రభుత్వము నందలి హిందూ కాంత లెట్టి యిక్కట్టు లనుభవించు చున్నారో నీ వెఱుంగవా?

రామా——ప్రాణేశ్వరా! సిసోదియా వంశపుఁ గీర్తిని నిలుపుటకును, ముఖ్యముగ మేవాడు రాజ్యము నందలి హైందవాంగనా మణుల మానము గాపాడుటకును మన మీ యక్బరు నెదిరించి సంగ్రామము మే చేయవలయును. కాని సామంతులము కాఁ గూడదు. సిసోదియా వంశము వా రక్షించిన ధనులని యక్బరు గుర్తెఱుఁగుఁ గాత.

జగ——దేవీ! అదియే మన విధికృత్యము. మంత్రివర్యా! మన యభిప్రాయమును యవనున కెఱిఁగింప వలయును గదా?

వాచ——చిత్తము. ఎఱిఁగింపవలెను.

జగ——అందుల కేరి నంపిన బాగుండును?

రామా——నాథా! రాయబారము కొఱకు పోవ మన శివకుమారుఁడు చాలఁ గాలము నుండి ముచ్చట పడుచున్నాఁడు.

జగ——ఔను. వాచస్పతీ! శివకుమారుని రప్పింపుము.

వాచ——చిత్తము. (ద్వారము దెసఁజూచి) ఎవఁడురా అక్కడ?

సేవ——(ప్రవేశించి) చిత్తము. ఆజ్ఞ గొనుసంగుఁడు.

వాచ——రాజాజ్ఞయని శివకుమారుని దోడి తెమ్ము.

సేవ——చిత్తము.

(అని పోయి వెంటనే శివకుమారునితోఁ బ్రవేశించుచున్నాఁడు)

శివ——జయము జయము మహారాజా!

జగ——శివకుమారా! అక్బరు మనపై దండెత్తి వచ్చె వింటివా?

శివ——చిత్తము. వచ్చినాఁడు. పురాకృత మనుభవించును. కాని మనము జంకెదమా?

గీ. ఉత్తమ క్షాత్ర కులమున నుద్భవించి

శూరుల మటంచు నెంతేని బేరు గాంచి
వైరి భూమీశుఁ డసి సేయ వచ్చినంత
వెఱతుమే పోర మనము? పృథ్వీ బిడౌజ!

జగ—వెఱచుటా? శివకుమారా! అగ్బరొక్కఁడే కాదు. నూర్గు రగ్బరులు దండెత్తి వచ్చినను మనము వెఱతుమా?

రామా—శివకుమారా! అగ్బరు చెంతకు రాయబారిగఁ బోయి వచ్చెదవా?

శివ—( ఆనందముతో ) మహారాణీ! నే నంతటి యదృష్టవంతుఁడనా?

వాచ—శివకుమారా! మాటలు చెప్పుట గాదు. చేసి చూపవలెను. అగ్బరు కఱకుఁ దురకే యని యెఱుఁగవా?

శివ—ఆర్యా! బ్రాహ్మణ మాత్ర తేజోభిరాములగు మీ రెఱుంగని దేమున్నది? అవసరము వచ్చినప్పు డగ్బరు రాజపుత్రుని కంటెఁ గఱకు గలవాఁడా?

గీ. మృదువు గల్గిన వానితో మృదువుఁ జూపుఁ
గఱకు గల్గిన వానితోఁ గఱకుఁ జూపు
నక్రమము సేయుటకు మాత్ర మనుమతింపఁ
డిలను రాజపుత్రుని సాటి గలరె యొరులు?

కావున మహారాజా! నా కృత్యమెద్దియో సెలవిండు.

జగ—ఓ బాలవీరుఁడా! నీ వా యగ్బరు చెంతకుం బోయి వానితో మా మాటలుగా నిట్లు చెప్పుము.

గీ. బ్రతికియున్నంత వఱకును రాజపుత్రు
లహిత నృపులకు సామంతులగుట కల్ల;
అడలి బెదరింపులకు మాన మొడలఁ జేసి

కష్టము నొసంగుటయు నంత కంటెఁ గల్ల.

కావున నో మ్లేచ్ఛుఁడా!

ఉ. మంచియుఁ జెడ్డయుం గనక మా పురి చెంగట సేనతో విజృం
భించి దురమ్ము సేయుటయొ బేడిగముం గొనుటో యొనర్పఁగా
నెంచి ముదమ్మునఁ విడిసితీవు; సరే యిఁక మాన నేటికిఁ
గొంచక యుద్ధమే సలుపఁ గోరిక యయ్యెడి పోర నిల్వుమీ.

కాని యొక్క విషయము మాత్రము నీవు ముఖ్యముగ గమనింప వలెను.

గీ. మంచియో చెడ్డయో విక్రమించి సంగ
రమ్ము సేయఁగ నుంటిమి మమ్ముఁ జంప
వలయు, మీరైనఁ జావంగ వలయుఁ గాని
రణము విడనాడి పాఱిపోరాదు సుమ్ము.

పొమ్ము. ఈ మాటలనే వానితోఁ జెప్పిరమ్ము.

రామా—శివకుమారా! అగ్బరుతో నా మాటలుగాఁ గూడ నిట్లు చెప్పుము.

గీ. వచ్చినాఁడవు మా కోటఁ బట్టుకొనఁగ
నెలమిఁ గొండంత యాసతోఁ; నెవరు జయము
గాంతురో చెప్పఁ జాలము; కాని రణము
మాని పోకుము తలవంపు లౌను మాకు.

పొమ్ము. మామాటలను నిర్భయముగాఁ జెప్పి రమ్ము.

శివ—మహారాణీ! నిర్భయము గాకేమి?

ఉ. ఉత్తమ రాజ వంశమున నుద్భవ మందితి, భూరి శౌర్య సం
పత్తిని గాంచినాఁడ, ననమాన భుజా బల శౌర్య ధైర్య సం
పత్తికి స్థాన భూతులగు పార్థివ శేఖరు బంట నట్టిచోఁ

జిత్తమునందు నే భయముఁ జెందెద నే? యరితోడఁ బల్కుచోన్.

అమ్మా! నా సామర్థ్యమును నేను జెప్పుకొనుట గాదు. చూచెద దరు గాక.

వాచ—శివకుమారా! జాలమేల? వేగఁ బోయి రమ్ము.

శివ—చిత్తము. మహారాజా! నాకు సెలవొసంగుఁడు.

జగ—జాగ్రత్తగఁ బోయి రమ్ము.

రామా—శివకుమారా! నేఁడే యుద్ధారంభ మని యగ్రజుతోఁ జెప్పి రమ్ము.

శివ—మహారాణీ! సెలవైనచో నిప్పుడే కయ్యము గలిపి వచ్చెద.

రామా—( మందహాసము గావించి ) పోయిరమ్ము.

శివ—చిత్తము. ( అని నిష్క్రమించుచున్నాఁడు )

జగ—మంత్రివర్యా! మనము గూడ యుద్ధసంనద్ధులమై యుండవలయును గదా? ప్రళయ సమయ ఘనాఘన గర్జారవ సదృశారావ మగు మన రణభేరిని మ్రోయింపించి సిద్ధముగ నుండుము.

వాచ—చిత్తము.

( అని యందఱు నిష్క్రమించుచున్నారు )

ఇది ప్రథమాంకము.



శ్రీ ర స్తు.

# సాహసిక రాజపుత్త్రికము.

## ద్వితీయాంకము.



( ఫకీరు వేషముతో ఫిడేలు పట్టుకొని రామాబాయి ప్రవేశించుచున్నది )



రామా—( తన వేషమును బరీక్షించుకొని తనలో ) ఎంత మాత్రము నెచ్చు తగ్గులు లేక నా ఫకీరు వేషము చక్కఁగ నున్నది. నేను స్త్రీ నని తెలియక పోవుటయే గాక మాయ ఫకీరు నని యితరులకు బొత్తిగాఁ దెలియదు. ఈ వేషముతోఁ బోయి యెదుట నిల్వ నా ప్రాణేశ్వరుండు సైతము నన్నానవాలు పట్టఁ జాలక పోయెను. ఇఁక నన్నెవ్వరు గుర్తింపఁ జాలెదరు? కాని నేను గుప్తముగా నుంచుకొనిన కట్టారి పైకిఁ గాన్పించుట లేదు గదా? ( చూచి ) లేదు. నా వేష మంతయు ననితర వేద్యముగనే యున్నది. నా చింతిత కార్యము గూడ నిర్విఘ్నముగ నెఱవేఱ వలయును. నేఁ డవక్ర పరాక్రమ శాలియగు మదనమోహనుఁడు మ్రగ్గుటచే రాజపుత్త్ర సైనికు లోకింత యుత్సాహము దక్కియున్నారు. వారి నిరుత్సాహమును బోఁ గొట్టఁ దలఁచి ప్రాణేశ్వరుని చెంతకుఁ బోయి,—

గీ. తురక బంటులు భీతిల్లి తొలఁగి పోవ
నడరి భారత సైనికు లరిసె మంచ
మాయ వేసము గైకొని పోయి యిపుడ

యగ్బరుని ద్రుంచి వచ్చెద నానతిండు.

అని ప్రార్థించి సెలవు బడసితిని. మఱియు నా నాథుఁడు “నీవు కుసుమ కోమలివి. ఉత్కృష్ట కార్య నిర్వహణ భారము మీఁద వైచికొని యున్నావు. నీ చింతిత కార్య ప్రయత్నమెట్లు పరిణమించునో దురూహ్యము. ఈయవసరమున మానభంగ మగునట్టి ప్రసంగము వచ్చిన యెడల రాజపుత్ర స్త్రీల కుచితమగు నాత్మహత్య గావించుకొనుటకును లేకున్న నగ్బరుని బొడిచి వేయుటకును గటారి నతిగుప్తముగా నుంచికొని వెళ్లు” మని యాజ్ఞాపించెను. అతి జాగరూకత తోడను ధైర్యసాహసముల తోడను నే నీకార్యమునఁ బ్రవర్తించెదను. ఆవల దైవ యోగ మెట్లున్న నట్లగును. ( ముందుకుఁ జూచి ) అల్లవే మహమ్మదీయుల శిబిరములు. అపారమగు నీ శరత్కౌముదీ లహరి నా తెల్లని పట కుటీరములు తేలియాడుచు మనోమోహనములై విలసిల్లుచున్నవి. నిర్విఘ్నముగ నే నీ శిబిరముల నన్నింటిని నతిక్రమించి యగణ్య భట పరివేషితమగు నగ్బరున్న డేరాలోఁ బ్రవేశింపఁ గలిగితి నేని నా ప్రయత్నము నెఱవేఱిన ట్లే. ఇఁక నే నాలస్యము సేయరాదు. నా యెడల నేరికి ననుమానము కలుగకుండు నట్లే మార్గమునఁ గాక యెక్కడ నుండియో వచ్చుచున్న ట్లర్థమగుట కా త్రోవ నరిగి యవన శిబిరముల చెంతఁ బ్రత్యక్షమయ్యెదను. పగలు యుద్ధముఁ జేసి యెంత యలసియున్నను నీ శారద చంద్రికా విహారముచే నా యలసట కొంత వఱకు వోవును కాన నా గాన మగ్బరునకుఁ బారవశ్యము గలిగించి విధి కృత్య నిర్వహణమున నాకు సాయ పడ వచ్చును.

( అని నిష్క్రమించుచున్నది )

ఇది విష్కంభము.



( ఒక శిబిరమున నగ్బరు, మానసింహుఁడు, ఒక భటుఁడు
ప్రవేశించుచున్నారు.

అగ్బ—మేలు మేలు! తరువాత నేమి జరిగినది?

భటు—కన్నులనుండి క్రోధాగ్ని కీలా విస్ఫులింగమ్ము లురల విద్యు ల్లతం బోలి తళతళలాడు దీర్ఘ కరవాలములం ద్రిప్పుకొనుచు మన సైనికు లెల్లఱు రాజపుత్త్ర వీరులపైఁ బడి పల్లార్పఁ దొడఁగిరి.

అగ్బ—బాగు బాగు! తరువాత?

భటు—అట్లు రౌద్రమూర్తులై విజృంభించుచున్న మన సైనికుల రాపిడికిఁ దాళఁ జాలక వైరి వీరులు వెను దీయఁ జొచ్చిరి.

అగ్బ—( ఆనందముతో ) మహమ్మదీయుల శౌర్యాగ్ని కీడు గలదా? తరువాత?

భటు—క్షత్త్రియ వీరు లట్లు వెను దీయుచుండుటం గాంచి వారి నాయకుండగు మదన మోహనుఁడు "పోకుఁడు పోకుఁడు. పోటు బంటు లయ్యు, రాజపుత్త్ర సైనికులయ్యు నట్లు తురుష్కులకు వెను దీసెదరే? మఱలుఁడు మఱలుఁ" డని గంభీ రాట్టహాసముతోఁ బ్రోత్సహించుచు బడబాగ్ని జ్వాలలనీనుచున్న నిశిత ఖడ్గమును ద్రిప్పుకొనుచుఁ బ్రత్యక్ష దండ ధరుని పగిది మండి పడుచు మన సైన్యమునల్లకల్లోలము సేసివైచెను.

అగ్బ—మదనమోహనుఁ డంతటి వీరుఁడా?

మాన—సార్వభౌమా! మదనమోహనుఁ డసామాన్య వీరుఁడు. అట్టి వీరులు చిత్తూరు దుర్గమున ననేకులున్నారు. అట్టి వీరులుండుట చే తనే యాకోట యింత పఱకు నొరుల వశము కాకుండ నున్నది. అట్టి వారితోఁ దలపడుటచే దేవర వారి పౌరుషము మిక్కుటముగఁ బ్రకాశింపఁ గలదు.

అగ్బ—మానసింహా! ఈ యుద్ధమెట్లు పరిణమించునని నీ యభిప్రాయము?

మాన—ఓ హిందూ దేశ చక్రవర్తీ! దేవర వారి మనోభీష్ట ప్రకారముగఁ గాక నేఁటొక రీతి నెట్లు పరిణమించును! ఎంతటి వీరులను గల్గియున్నను మేవాడు రాణా మిమ్ము జయింపఁ గలఁడా?

మ. అలఘూదార పరాక్రమ మ్మయిన సైన్యమ్ముల్న్, దీవ్య ద్భుజా
బలవంతుం డయినన్ స్వయమ్ము, బలవ త్ప్రత్యర్థి దుర్భేద్యమై
బలితవ్యాఘన దుర్గముండినను మేవాడీశ్వరుం డారయన్
శలభ ప్రక్రియ నగ్గిఁబోఁడె వడి యుష్మ చ్ఛౌర్య కల్పాగ్నిలోన్.

అగ్బ—(శిరః కంపము గావించి) మానసింహా!

గీ. కత్తిచేఁబట్టి భీమ సంగ్రామ సీమఁ
ప్రాఢిమ్నై నిల్వఁగన్నంత వఱకె కాని
అడరి నిల్చిన నాదు శౌర్యాగ్ని శిఖల
భస్మమై పోదె వైరి భూపాల వనము.

సేవకా! తరువాత నేమి జరిగినది?

భటు—మదనమోహనుని యుద్ధసత్త్వమున కోర్వఁ జాలక మన సేన నలు మొగంబులఁ జెల్లా చెదరుగఁ బాఱిపోవు చుండ సేనాని యసఫ్ఖానుండు చూచి రోషకషాయితాక్షుండై మదన మోహను నెదుర్కొనియెను.

అగ్బ—తరువాత?

భటు—అట్లు మదనమోహనునితో నెదుర్కొని యవక్ర పరాక్రమ మేపార నత్యద్భుతముగఁ బోరి తుద కసఫ్ఖానుఁడే వెనుదీయుటకు సిద్ధ పడెను.

అగ్బ—ఏమీ? అసఫ్ఖానుఁడే వెను దీయ సిద్ధ పడెనా?

చ. అనుపమ సత్త్వసంపదల కాకరమౌ యవనాన్వయమ్మునన్
జననము గాంచి, ధైర్య బల శౌర్యయుతుండయి, వైరి భూప మ
ర్దను భటుఁ డయి నించుక ప్రతాపము గల్గిన రాజపుత్త్రుతోఁ
బెనఁగి దురమ్ము సేయుటకు భీతిలి తా వెనుదీయ నెంచెనే?

రణరంగభీరులకుఁ గాలాంతకుం డని నన్నెఱుఁగఁడు కాఁబోలు!

మాన--అన్నా! అసఫ్ఖానుఁ డెంత పౌరుషము లేని పని సేసెను.

గీ. కనఁగ క్షణభంగురమైన తనువు కొఱకు
నాశ విడఁజాల నట్టి వాఁ డహిత వీరు
ననిఁ జెనకఁ గూడ దట్లు; డీకొనిన వాఁడు
పాఱిపోరాదు; పోవుట పౌరుషమ్మొ?

భటు--(తనలో) తానేమో మహా వీరుఁడనని మానసింహుఁడసఫ్ఖానుని దెప్పఁ జొచ్చినాఁడు! పాదుషా వారితో నెదిరించుట కొఱవితోఁ దలఁ గోఁకి కొనుట వంటి దని యెఱింగి వారి యనుగ్రహము నాశించి తన చెల్లెలిని సలీము రాకొమరున కిచ్చిన మానసింహుఁడు నొక వీరుఁడేనా?

అక్బ--తరువాత నేమి జరిగినదిరా?

భటు--దేవా! అసఫ్ఖానుఁడు పాఱిపోవ యత్నించుచున్నాఁడని యెఱింగి యొక్క దెబ్బన మడియించుటకు మదన మోహనుఁడు ఖడ్గ మెత్తెను.

అక్బ--(ఆత్రముతో) తరువాత తరువాత?

భటు--సార్వభౌమా! ఏమి చెప్పుదును? అసఫ్ఖానుని దునుముటకు మదనమోహనుఁడు ఖడ్గము నెత్తఁగనే యెటనుండి వచ్చెనో గాని మన భటుఁ డొకఁడు క్రచ్చరఁ జనుదెంచి మదన మోహనుని దక్షిణ హస్తమునఁ గృపాణ సహితముగఁ గ్రిందఁ బడఁ గొట్టెను. ఆ దెబ్బతో బిగి




నడలి సంతాపభరమ్మున నిట్టూర్పులఁ బుచ్చు[illegible]
నసఫ్ఖానుఁ డొక్క వ్రేటున సంహరించెను!

అగ్బ——ఆహా! అసఫ్ఖానుఁ డెంతటి వీరాధి వీరుఁడు! మానసింహా! మదనమోహనుని కరమును ఖండించిన సైనికు నిటు రప్పింపుము.

మాన——చిత్తము (అని ద్వారము దెసఁ జూచి) ఎవఁడురా అక్కడ?

సేవ——(ప్రవేశించి) చిత్తము. మహాప్రభూ! ఆజ్ఞకై వేచియున్నాఁడ.

మాన——మా శిబిరములో నున్న మహమ్మద్ఖాను నిటకు రా నాజ్ఞ యని తెలుపుము.

సేవ——చిత్తము.

(అని పోయి వెంటనే మహమ్మద్ఖానునితోఁ బ్రవేశించును)

మహ——(అగ్బరునకు మానసింహునకు సలాములొనర్చి నిలుచును)

అగ్బ——మహమ్మద్ఖానుఁడా! నీ తెగువకు సంతసించితిమి. మన సైనికుల కుల్లాసము గల్గున ట్లసహాయ శూరుఁడగు నొక్క రాజపుత్ర సేనాధీశ్వరుఁడు మడియుటకుఁ గారణమైతివి. మేలు మేలు! మానసింహా! వీనికిఁ దగు పారితోషిక మొసఁగునట్లు కోశాధిపతికి వ్రాసి నీ వేగి రేపటి సంగ్రామ క్రమమును సైనికుల కెఱింగింపుము.

మాన——చిత్తము.

(అని మహమ్మద్ఖానునితో నిష్క్రమించు చున్నాఁడు)

అగ్బ——(తనలో) అద్దిరా! రాజపుత్రుల పరాక్రమము! ఆఱు దినములనుండి యపారమగు మా వాహిని నెదిరించి యత్యద్భుతముగఁ బోరుచున్నారు! తుదవఱకు నీ ధైర్య సాహసములతో క్షత్త్రియులు పోరఁ గలరా? అబద్ధము! బాల్యము నుండియు నపజయమెట్టిదో యెఱుం

గని వీరాధి వీరుఁడగు నక్బరు చెంతనా క్షత్రియుల యాటలు సాగుట?

( తెరలో )

నేను పాదుషాను జూచి యాశీర్వదింప వచ్చితిని. నన్నాతని చెంత కుఁ గొనిపొండు.

అక్బ--( తనలో ) నన్నాశీర్వదింప వచ్చిన యీ మహానుభావు లెవరై యుందురు?

సేవ--( ప్రవేశించి ) దేవా! ఒక ఫకీరు దేవర దర్శనమును గోరుచున్నాఁడు.

అక్బ--పూజ్యులగు వారిని శీఘ్రముగఁ బ్రవేశ పెట్టుము.

సేవ--చిత్తము.

( అని పోయి ఫకీరు వేషముతోనున్న రామాబాయితోఁ బ్రవేశించి ) వారే పాదుషా వారు.

రామా--( తనలో ) చూపవక్కఱ లేదు. నా కటారి ప్రేటునకు గుఱిగా నున్న మ్లేచ్ఛుని నే నెఱుంగుదును.

అక్బ--( ఎదురేగి ) మహాత్మా! సేవకుఁ డిదే ప్రణామిల్లుచున్నాఁడు. ( అని వంగి సలాము చేయుచున్నాఁడు )

రామా--

గీ. విశ్వమున నెల్ల చోటుల వెలసియుండి
జను లొనర్చెడి కృత్యముల్ గనుచు నుండి
పాపులకు శిక్షఁ జేయుచు భక్తవరులఁ
బ్రోచు నల్లా సతమ్ము నిన్ బ్రోచుఁ గాక.

అక్బ--మహాత్ముల యాశీర్వచనము శిరసా వహించినాఁడ.

రామా--ఓ అక్బర్! నీవు మేవాడు రాజ్యాధీశ్వరులచేఁ గప్పము గొన వారి దుర్గమును ముట్టడించి సామోపాయముచేఁ గార్యము

చక్కఁ బడమి వారితో సంగ్రామము సేయుచున్నావని మాకుఁ దెలియ వచ్చినది. యుద్ధరంగమున సంచరింప వలసి వచ్చుటచే నీ విప్పు డెంతె న నలసి యుందువు. శ్రమ నపనయించి యుల్లాసము గూర్చుటలో గాన మును మించినది మఱి యొకటి లేదు. అట్టి గాన విద్యలో నా కనంత వైదగ్ధ్యము గలదు. కావున నా శక్తి కొలఁది ఫిడేలు వాయించి యీ శ్వర భజన గావించి నీ కానందమును గలిగించి నా విధి కృత్యమును నె ఱవేర్చుకొందమని యిట్లు వచ్చితిని.

అగ్బ—చిత్తము. రస పుత్త్రులకును మాకు నిప్పుడు దారుణ సం గ్రామము జరుగు చున్నది. ఈ మహా యుద్ధ మెట్లు పరిణమించునో గా ని మీరు సెల విచ్చినట్లు నే నిప్పుడు మిక్కుటముగ నలసి యున్నాఁడను. నావంటి వారి కిట్టి పట్టుల గాన శ్రవణ మావశ్యకమే. అయినను మిమ్ము శ్రమ పెట్ట వలె నేమో యని జంకు చున్నాఁడను.

రామా—నీ వట్లు తలంప వలదు. ఇందు మా కెంత మాత్రము ను శ్రమ లేదు. గాన విద్య మాకు బాల్య పరిచితము. కాని విధి కృత్య నిర్వహణము నందు శ్రమ గలుగుట సహజమే. కాని యట్లని వెను దీ యుట „ అల్లా ” యాదేశము నతిక్రమించుట గాదా?

( అని యొక గీతము బాడుచు ఫిడేలు వాయించును )

అగ్బ—హాయి హాయి! మీ గాన వైదుష్యము వర్ణనీయము!

గీ. భక్తి రస బంధురమ్మయి, వర్ణనీయ
కంబు కంఠోదితమ్మయి, కరము శ్రావ్య
మైన యంత్ర స్వరమ్మున లీన మగుచుఁ
గౌతుకము గూర్చె నౌర! మీ గీత మెంతొ.

రామా—అగ్బర్! ఇంకను వినుము.

( అని మఱియొక గీతము బాడును )

అక్బ—మహాత్మా!

గీ. ఔర! మందర మధ్యమ తారకమ్ము
లనెడి మిట్ట పల్లమ్ముల యందు శ్రావ్య
మైన రావమ్ముతోడ మీ గాన లహరి
త్వరిత గతిఁ బాఱుచుఁ బ్రమోద గరిమఁ గూర్చె.

రామా—మఱియొక గీతము నాలింపుము. (అని పాడు చున్నది)

అక్బ—హాయి హాయి!

(అని యానంద పారవశ్యముచే గన్నులు మూసికొని తాళము వేయుచున్నాఁడు)

రామా—(తనలో) ఇదే సమయము. (అని ఫిడేలు నొకచోఁ బాఱవైచి గుప్తముగఁ దెచ్చిన కటారిచే నక్బరుని బొడువఁ బోవు చున్నది)

అక్బ—(తనలో) పాట వినఁబడ దేమి చెపుమా? (అని కం డ్లు తెఱచి చూచి మాత్రములో) "ఆఁ! ఆఁ!" యని రామాబా యి చేతనున్న కటారి నూడఁ బెఱికికొని) ఓ వేషధారీ! నీ వెవఁడవో చెప్పెదవా లేదా?

రామా—ఓ ఢిల్లీశ్వరుఁడా! నీ వడుగ నక్కఱలేదు. చెప్పెద వి నుము. ఏ మహారాజ్యము వెంట వెంటఁ దండోప తండములుగా వచ్చి దారుణ సంగ్రామము గావించినను మహమ్మదీయుల పాలు కాలేదో య ట్టి మేవాడురాజ్యమును బాలించుచున్న వీరాధివీరులును యోధాన యో ధులు నగు శ్రీ జగమల్లమహారాజు గారి ధర్మపత్ని యగు రామాబాయి యని నన్నెఱుంగుము. మఱియు నీ ప్రాణములను దీయ వచ్చిన నన్ను సంహరించి నీ పగఁ దీర్చికొనుము.

అక్బ—ఓ కాంతా! నీవు నా ప్రాణములను దీయుటకు వచ్చిన

దానవే నైనను నీవు స్త్రీ నగుటచే నీ యపరాధమును మన్నించితిని. అనుపమానమైన నీ గాన విద్యా నైపుణ్యమునకు మెచ్చితిని. కావున నీ కేమి కావలయునో కోరు కొనుము.

రామా—ఓ యవనుఁడా! నీవు నా గాన విద్యా నైపుణ్యమునకు మెచ్చినను మెచ్చకున్నను నేను నీప్రాణములను దీయుటకై వచ్చియున్నదాన. నేను నా కృత్యమును నెఱవేర్చు కొనుటలోఁ గృతార్థురాలను గాలేక సంపూర్ణముగ నీ చేతఁ జిక్కితిని. నిన్నంత మొందించుటకే నెంత ప్రయత్నించినను దైవేచ్ఛ వేఱొక రీతి నుండుటచే నా యుద్యోగము విఫలమైనది. ఒకవేళ నా యుద్యోగము కొనసాగని యెడల నేను మరణించుట నిశ్చయమని యెఱింగి యుండియే వచ్చితిని. కాని యజ్ఞానముచేఁగాదు. సత్పథసంచారుల మైన మాకు విరోధి వగు నిన్ను వధించుటకుఁ బ్రయత్నించుట మాకు ధర్మము. కాని నా దురదృష్ట వశమున నీకుఁ జిక్కిపోయితిని. చింత లేదు. నిన్ను యమ సదనమున కంపి వచ్చెదనని మావారితో బీరములు పలికి వచ్చితిని. అట్టి యెడ భగ్న ప్రయత్ననై మానవంతులగు రస పుత్త్ర వీరుల మొగముల నే నెట్లు చూడఁ గలను? కావున సంశయింపక నన్నుఁ గడ తేర్పుము. అదియే నా కోరిక.

అగ్బ—నిర్భయమై, గంభీరమై ధారాళమగు నీ వక్తృత్వమునకు మెచ్చితిని. నీ శౌర్య ధైర్యము లెంతయుఁ బ్రశంసనీయములు. మీాకేను శత్రుఁడను. విరోధి నగు నన్నుఁ గటతేర్ప మీారు ప్రయత్నించుట దోషము గాదు.

రామా—నిన్ను రూపు మాపుటకై వచ్చి నా దురదృష్టవశమున నీచేఁ జిక్కిన నన్నుఁ గడతేర్చుటయు నీకు దోసము గాదు.

అగ్బ—నీవు పురుషుఁడ వైనచో నట్లే. కాని కోమల హృదయలగు లేమలను వధించుట కీశ్వ రాజ్ఞ లేకుండుటచే నాకుఁ జేతు లాడవు. నా

యాజ్ఞ లేకుండుటచే నా భటుల చేతు లాడవు. ఇక మానవతివగు నిన్నంత మొందించుటెట్లు?

రామా—ఓ అక్బర్! స్తోత్ర రూపకములై క్రూర నారాచ పన్నిభములైన పలుకులచే నా హృదయభేదన మేల కావించెదవు? నీ కరమున ధగధ్ధగాయ మానమై వెలుంగుచున్న యీ కటారిచే నీ తుచ్ఛ శరీరము నుండి ప్రాణములను దొలఁగించి పుణ్యము గట్టు కొనుము.

అక్బ—ఓ కాంతా రత్నమా! నీ వెంత చెప్పినను వినకున్న దాన వు. నీ దారుణ వచనములు నా కర్ణపుటమును జిల్లులు వోఁ గొట్టు చున్నవి. నీ మాటల నాలకించుట యందు నాకు వైముఖ్యము గలుగు చున్నది ఇక్కడైనను మీరు సంధి కొడం బడెదరేని మీ మీ పరాక్రమ ములకుఁ దగినట్లు గౌరవించెద.

రామా—ఓ యవన వీరుఁడా! మానధనులైన క్షత్త్రియ వీరులు నీవు చేయు స్వల్ప మర్యాదల కాశించి నిష్కళంకమగు తమ కీర్తిని మంటఁ గలుపుకొనరు. నిశ్చయమైన మాటఁ జెప్పెద వినుము.

గీ. బ్రతికి యున్నంత వఱకును రాజ పుత్త్ర
లహిత నృపులకు సామంతు లగుట కల్ల
అడలి బెదరింపులకు మాన మెడలఁ జేసి
కప్పము నొసంగుటయు నంత కంటెఁ గల్ల.

ఇన్ని మాట లేల? నీ యెడ మహాపరాధమును జేయ నెంచిన నా ప్రాణములం బుచ్చుకొనుము.

అక్బ—ఎన్ని విధములఁ జెప్పినను నీ వా కోరికను మానకుంటివి. కానిమ్ము. అక్బరు నీతి లేని వాఁడు కాఁడని మీ వారి కెఱుఁగ నిమ్ము. (ద్వారము దెసఁ జూచి) ఎవఁడురా అక్కడ?

సేవ—ఆజ్ఞకై వేచి యున్నాఁడ మహాప్రభూ!

అక్బ——ఈ ఫకీరు నొక పల్లకిలోఁ గూర్చుండఁ బెట్టి సగౌరవమ్ము
గఁ జిత్తూరు కోటలో విడిచి వచ్చునట్లు సేయ మానసింహున కాజ్ఞ యి
ని తెల్పుము.

సేవ——చిత్తము. మహాత్మా! దయ సేయుఁడు.

రామా——( తనలో )

గీ. అక్బరుని గూర్చి వచ్చెద నంచుఁ గూర్మి
భర్తతోఁ బీరములు వల్కి వచ్చియుంటిఁ
జెప్పి నట్టు లొకింతైనఁ జేయకుండఁ
గటకటా! నాథు మొగ మెట్లు కాంచు దాన?

( అని యండఱు నిష్క్రమించుచున్నారు )

ఇది ద్వితీయాంకము.

శ్రీ ర స్తు.

# సాహసిక రాజపుత్రికము.

## తృతీయాంకము.

[ సంగ్రామ రంగము. ]

( జగమల్లమహారాజు, వాచస్పతి ప్రవేశించుచున్నారు )

జగ--వాచస్పతీ!

వాచ--మహాప్రసాదము స్వామీ!

జగ--ప్రభాతము కావచ్చుచున్నది. కోట యెల్లెడల మన సైన్యమును గోటను జుట్టు ముట్టి మహమ్మదీయ సైన్యమును బరస్పర జయాభిలాషలతో సంకుల సమరమును జేయుటకు సిద్ధముగ నున్నవి. యుద్ధము ప్రారంభించి యారు దినము లైనది. కాని యిరు వారికుల యందును ధైర్యోత్సాహములు తరిగి పోక క్రమ క్రమ ప్రవర్ధమానము లగుచున్నవి. మన సైనికులను గాంచి మహమ్మదీయులును, మహమ్మదీయ సైనికులనుగాంచి మనవారును విజృంభించుచున్నారు. కాని యీ దారుణ సంగ్రామమున కంతమెప్పుడో తెలియకున్నది.

వాచ-- మహారాజా! ఈ మహా సంగ్రామమింక నెన్నిదినములుజరుగుచుండినను నుండునుగాక. కాని రాజపుత్రవీరులు మాత్రము ప్రాణములనువిడుచుటకైన సమ్మతింతురు గాని రణరంగమును విడుచుట కంగీకరింపరు. ఎన్నిదినములు పోరినను రవంతయు ఫలములేక విసిగివేసా

రి మహమ్మదీయులే యిట నుండి కదలి పోవలెను.

జగ--ఔను. మన భటు లట్టి వారే. వారి తెగువ యీ యాఱు దినములనుండియుఁ జూచుచునే యున్నారము గదా? వాచస్పతీ!

గీ. కొంకు విడనాడి ముందు దూఁకుటయె గాని
అడఁగి వెన్కకు నడుగైన నిడుట లేదు;
ఎత్తిన కరాసి రిపు వీరు నీల్గఁ జేయు
చుంటయే గాని యసిఁ బోవు చుంట లేదు.

కాని మంత్రివరా! ఈ యాఱు దినములలో మన సేన యెంత గతించినది?

వాచ—దేవా! మన సేనలో నిరువది వేల భటులు మ్రగ్గిరి.

జగ—అబ్బా! ఆఱు దినములకే యింత కడతేఱినదా? రిపు సైన్యములో నెందఱు గతించిరో తెలిసినదా?

వాచ—చిత్తము. నిన్నటి రేయి మాయావి యగు మురళీధరు నంపి తెలిసికొంటిని. రిపుసైన్యములో ముప్పదినాల్గు వేలు గతించిరఁట!

జగ—ఇంతవఱకును మన భటులు చక్కఁగనే పని చేసినారు. కాని మన భటు లెంత పరాక్రమవంతులైనను మన మీ యక్బరు నెదిరించుట కొండతోఁ దగరు తాఁకి నట్లున్నది.

వాచ—మహారాణా! రిపు సైన్య మతిశయముగ నున్నదని మనము వెఱతుమా?

జగ—వెఱచుటా? ఎంత మాట పల్కితివి! ఈ కాయము సుస్థిరము గాదు గదా? ఇఁక భయమేల?

( తెరలో భేరీ ధ్వని )

జగ—( ఆలకించి ) అల్లదే భేరీ ధ్వని యైనది. తురకలు యుద్ధమారంభించినారు. మంత్రివర్యా! నిముసము క్రిందట నత్యంత నిశ్చలము

లై యున్న నాహోని యిపు డెంత యల్లకల్లోలముగ నున్నది!

వాచ—ఆహా!

శా. భేరీ రావము మిన్ను ముట్టఁగ నయుద్వేల ప్రమోదమ్మునన్
బోరన్ మేకొనియున్న యిట్టార మ్ముల్ పేర్చి యొక్కమ్మడిన్
భోరానార యుగమ్ము ఖాతి వది ఫున్నాగ ద్వయ మ్మట్టులా
హాఁ! వీరోని యుద్ధమున్ సలుప నత్యాశ్చర్య మేపారఁగన్.

జగ—అద్దిరా! వాచస్పతీ!

గీ. కరము నావేశముఁ బరస్పర జయాభి
లాషులై ప్రాణహానిఁ గలంపఁ బోక
కరమ్ముగఁ బోరు నా వీరవరుల
శౌర్య ధైర్యంబులను జూడు సచివవర్య!

( తెరలో )

మేలు సదాశివరాయా! మేలు! నీ పరాక్రమము ప్రశంసనీయము!

జగ—( ఆలకించి ) ఈ కంఠ ధ్వని నా ప్రాణేశ్వరి దని తోఁచు చున్నది. ( చూచి ) అదిగో నా జీవితేశ్వరియే. ఆహా!

చ. పొలఁతి యయ్యెఁ బూరుషుని పోల్కి కిరీటమును గట్టి మెనక
తనమును నక్క పాగయును దాల్చి కరమ్మున ఖడ్గమూనియున్
బలువుగ రాజపుత్త్రులకుఁ బౌరుషముం గలిగించుచున్న యీ
చెలి తులలేని యొక్క జగజెట్టిని బోలి ముదమ్ము గూర్చెడిన్.

వాచస్పతీ! పలువురుచేడియ లూడిగముఁ జేయుచుండ సమస్తసౌఖ్యముల ననుభవించు చుండ వలసిన యీ ముద్దుగుమ్మ నిష్కారణ కలహ కారణుఁ డగు నక్బరు దురాశ నంది మాపై దండెత్తి వచ్చుటచే సంగ్రామము సేయవలసి వచ్చెఁ గదా? కటకటా! ఈ తురుష్కులు తాము సుఖపడఁ జాలరు. ఒరులను సుఖం పడనీయరు.

వాచ—మహారాజా! కానిండు. దైవయోగ మనిలంఘ్యము. ఈ సమస్థానము నాక్రమించు కొనుట కిదివఱ కనేక తురుష్కులు ప్రయత్నించిరి గాని రాజపుత్రులు దృఢదీక్షా సంపన్నులగుటచే స్థిరముగ లోఁబరచుకొనఁ జాలక పోయిరి. ఇఁక ముందు నట్లె జరుగును. కాని రాజపుత్ర కాంతల నిట్లు క్షోభ పెట్టుచున్న యీ తురుష్కు లెప్పటికైనఁ దగిన ఫలము ననుభవింపక పోరు.

జగ—ధర్మమను నది యున్న యెడల దాని జయమున కొక్కొక్కప్పుడు విఘాతము గలిగినను తుద కదియే జయించును. అన్యాయ విజయ మస్థిరము గాని సార్వకాలికము గాదు. ఐహిక సౌఖ్యము లాభాసములు గాని సత్యములు కావు. అట్టి యెడఁ బ్రాపంచిక సౌఖ్యముల కాశపడి యన్యాయమున కొడిగట్ట నేల?

( అప్పుడు రామాబాయి ప్రవేశించుచున్నది )

రామా—ప్రాణేశ్వరా! ఇచ్చట నేమి చేయుచున్నారు?

జగ—చేయుట కేమున్నది? ఇరువాగులు సంకుల సమరము గావించుచున్నవి. నేఁ డేమో గాని నా మనము మందర ఘూర్ణిత మహార్ణవము వలెనున్నది.

రామా—ఏమది? వాచస్పతీ! కారణ మేమూ గ్రహించితివా?

వాచ—అమ్మా! వేఱె కారణ మేమున్నది? కుసుమ కోమలులగు తమరు పురుష వేషమును ధరించి కఱకుఁ దురకలతోఁ బోరుచుండుటఁ గాంచుటచే మహారాణావారి హృదయ మట్లు సంక్షుభిత మగుచున్నది!

రామా—ప్రాణేశ్వరా! అదియేనా మీ చింతా కారణము? నేను కష్ట పడుచుంటి నని మీ రెంత మాత్రమును విచారింప వలదు. ఎంత కష్టపడి యైన శూర శిఖామణులగు మీ కర్థాంగి యనిపించుకొన వలెనను మహోత్కంఠతోఁ బోరాడుచుండుటచే నాకీ యుద్ధరంగ వీరవి

హార మానంద ప్రదముగనే యున్నది. అదియుఁ గాక, స్త్రీలు కష్టము ల నోర్వఁ జాలరని మీరు తలంప వలదు.

గీ. అంతిపురి నున్న సతుల హృదంతరములు
కుసుమముల కంటె నత్యంత కోమలములు
పాలికలన నున్న ముద్దుగుమ్మల మనములు
కనఁగ వజ్రాలకంటెను గర్కశములు.

కావున నేను కష్టపడుచుంటినని మీ రెంత మాత్రమును విచారింపవల దు. ఒకవేళఁ గష్టమే యగుఁ గాక. కష్ట సమయముల యందుఁ బతిని విడిచి యుండుటయు సుఖ సమయములయం దనుసరించి యుండుటయు సతీధర్మమా! పతి కష్టమే సతి కష్టము. పతి సౌఖ్యమే సతి సౌఖ్యము. సతీ పతులకు భేద మున్నదా? ప్రాణేశ్వరా! విచారమున కిది యదను గాదు. రండు. మన వీరులకుఁ బ్రోత్సాహము గలిగించి వత్తము. (తెర వైపుఁ జూచి) ఏమీ! రాజపుత్ర వీరులను జెల్లాచెదరుగఁ బా ఱఁద్రోలు నా వీరుఁ డెవ్వఁడు చెపుమా?

జగ—(చూచి) ఏమీ వాని పరాక్రమము! వాచస్పతీ! వాఁ డెవ్వఁడై యుండును?

రామా—(ఆత్రముతో) మానసింహుఁడు మానసింహుఁడు. వాచస్పతీ! ఇంకను జూచెద వేమి?

వాచ—మహారాణీ! ఇదే మానసింహాధమునిఁ గూల్చి వచ్చెద.

(అని నిష్క్రమించుచున్నాఁడు)

జగ—దేవీ! అద్దురాత్ముఁడు మానసింహుఁడా!

మ. అర రే! యెంతటి క్రూర కర్ముఁ డమలంబై పూజ్యమై పౌరుషా
కరమౌ క్షత్రియవంశ మెంతయు వెలుంగం బుట్టి, వైరి క్షమా
వర మత్తేభ మృగాధిపుండయి రణ ప్రావీణ్యుఁడై హైందవే

తర భూమీశ్వరు లెంకలై స్వకులముఁ ధ్వంసమ్ము గావించెదరు.

రామా—అక్బరునకు సామంతుఁ డగుట వలన మానసింహునకు మనతోఁ బోరక తీరదు. కాని యొక విషయమున మానసింహునిఁ దలంచి కొనినను నాయొడ లాపాద మస్తకమును గంపించును.

గీ. ఉత్తమ క్షాత్త్ర కులమున నుద్భవించి
తురక వానికిఁ గూర్మి సోదరి నొసంగి
కులము విడనాడి మర్యాదఁ గోలుపోయి
తిరుగుచున్నాఁడు నీచుఁడై తురకఁ గూడి.

జగ—దేవీ! మానసింహుని మేనత్త నక్బరు పెండ్లియాడ లేదా? అక్బరుతోఁ దన కిట్టి ప్రబల సంబంధము లుండుట వలననే మానసింహాధముఁడు రాజపుత్త్రుల మీఁదికి దూసికొని వచ్చుచున్నాఁడు.

రామా—ఛీ! ఛీ!! క్షత్త్రియకులమున నుద్భవించియు నా కాంతలు తురకలతోఁ గాపుర మెట్లు సేయుచున్నారో! ఆహా! విధి సంకల్పము!

సీ. గోవులఁ గన్నఁ ద్రెక్కొను తురుష్కుఁడు నాఁ
డాలఁ గొల్చెడి రాచ గోల యద్ది
విగ్రహారాధన వెక్కిరించును వాఁడు
విగ్రహమ్ములఁ గొల్చు వెలఁది యద్ది
విప్రవర్గ్యులకుఁ బెన్వెతలు గూర్చును వాఁడు
ద్విజులఁ బూజించెడి తెరవ యద్ది
కరము నాసక్తితోఁ గల్లు ద్రావును వాఁడు
కలు గాంచి రోసెడి కలికి యద్ది
గీ. కఠిన హృదయుఁడైన కఱకుఁ దురక వాఁడు
కుసుమకోమల మతి రాచ గోల యద్ది

అరయఁ గల దన్నిటను భేర మట్టి మొదలఁ
గటకటా! యిద్దరకు నెట్లు కలిసె నొక్కో.

జగ—ప్రాణేశ్వరి! ఇఁక న త్తుచ్ఛరాంగ్ర ప్రసంగమును జాలింపుము.

( తెరలోఁ గల కలము )

రామా—ఏమి యీ కలకలము?

జగ—దేవీ! ఆకలకల కారణ మేమో చూచి వచ్చెద నుండుము.

( అని నిష్క్రమించు చున్నాఁడు )

రామా—అన్నా! ఎవరి తోడను గయ్యము దలపెట్టి కొనక కుల క్రమాగతమగు రాజ్యమును నిశ్చలముగఁ బరిపాలించు చుండ దురాశా పీడితుఁడై యక్బరు దండెత్తి వచ్చి దేశ ప్రజల కలఁజేసి జీవితేశ్వరునకు మనః క్లేశమును గలిగించె గదా యని నేను వగచుచుండ నేను యుద్ధము సేయ వలసి వచ్చె గదా యని ప్రాణేశ్వరుఁడు నా కొఱ కెంతో పరితపించుచున్నాఁడు! కటకటా! ఇదివఱకు మాకును దనకును స్నేహ సంబంధము గాని వైరి సంబంధము గాని లేక యున్నప్పుడీ యక్బరు నిష్కారణముగ మా పై నేల దండెత్తి రావలెను? పరాక్రమ లవ దుర్విదగ్ధుఁడై వచ్చినాఁడు. వచ్చి మా కంఠములలోఁ బ్రాణము లుండఁగా నీ కోటను స్వాధీనము సేసి కొనఁ గలఁడా? ఏమీ! రాజ పుత్త్రులు వీని కంత చులకనగాఁ గాన్పించుచున్నారు కాఁబోలును! కానిమ్ము. మానధనులగు సిసోదియా వంశము వారితోఁ బోరుట యాట గాదని యక్బరు గ్రహించుఁ గాత!

( తెరలోఁ గలకలము )

రామా—ఏమి యీ కల కలము? ( చూచి ) మేలు సదాశివ రాయా! మేలు!

చ. ఇదె సమయమ్ము సుమ్ము యన నీశ్వరు బంటులు నిన్నదిప్పియున్
గగనము సేయఁ జాలక యెగాదిగఁ జూచుచు నున్నవాఁడు? దు
ర్జను లగు వారిపైఁ గనికరమ్మును మంతయుఁ జూపరాదు; బు
ద్ధ్యనుసృతమ్ము మేరు వడిఁ గ్రుంపుము గ్రుంపుము శత్రుసేనలన్.

(మఱలఁ దెరలో)

ఓరోరీ! తుచ్ఛులారా! మీ రిపుడు గాదింకొక నలువురు రండు.

సీ. సంశయింపక చను దెంచు సంగరమున
నిరువు రైనను మువ్వురైన నేవు రైనఁ;
గాని యసురుల పై నాన మాను కొనుఁడు
క్షత్రియుని గెల్వఁగా నీకు శక్యమగునె?

రామా——(ఆలకించి) ఎవరిదీ కంఠ ధ్వని? (చూచి) అన్నా! తురుష్కు లెంత దుర్మార్గులు? ఒక్కనితో నిరువురు పోర సమకట్టి యుండిరిగా? శివకుమారా! వెఱవకుము. వెఱవకుము. ఓరోరి తురుష్కాధములారా!

క. నిలుఁడు నిలుఁ డిర్వ రొక్కట
ఖలులారా! యొక్క వీరుఁ గదిసి దురమ్మున్
సలుపం బొచ్చెరరే? యెం
దుల కేగెద రింక మిమ్ముఁ గ్రుంచెద నిపుడే.

(అని లోనికి విక్రమించు చున్నది)

(అప్పు డతి వేగమున మాన సింహుఁడు ప్రవేశించుచున్నాఁడు)

మాన——ఆ యధముఁ డింకను వెన్నంటి వచ్చుట లేదు గదా?

(అని వెను దిరిగి చూచు చున్నాఁడు)

(తెరలో)

చ. సరి సరి! పాఱిపోయెదవు శౌర్యమెయియ్యది మానసింహ! యం

బరు నకు రాజ వంట! యగబ ర్నరపాలుని మంత్రి వంట! యు ర్వర నిను బోలుశూరుఁడు పరాక్రమవంతుఁడు నున్నయంట! యే దిర భవదీయశౌర్యము!మదిఁ బుయిలోటములేదె యోడఁగన్.

మాన—(తనలో) అద్దిగా! వాచస్పతి పరాక్రమము! పెక్కు యుద్ధములు సేసితిని గాని నే నిట్టి పరాక్రమవంతు నెందును జూచి యుండ లేదు. వాచస్పతి శౌర్యాగ్ని బడబాగ్నివలె దుస్సహమైనది. ఆహా! అనేక వీరులం గూల్చిన వాఁడ నయ్యు నేఁడీ వాచస్పతితోఁ బోరఁ జాలక పాఱిపోయి వచ్చితిని. కానిమ్ము. ఎప్పటికైన వీని యంతము గన్గొని తీరెద.

( తెరలో )

ఓరోరీ. క్షత్రియ కుల కళంక! మానసింహాధమా! ఎందుఁ బో యెదవురా?

చ. నిలు నిలు పాఱిపోక రజపుపతికేతను పక్షపాతివై
కులము సెడంగ; గౌరవము గోల్పడ క్షత్రియ వీరు లెల్ల తో
దలలను వాల్ప సిగ్గునఁ; బ్రతాప లవమ్ములఁ గన్న గానకే
చెలయుచు సంచరించు నిను జీల్చెద ఘోర తరాసిచే ననిన్.

మాన—( విని యులికిపడి తనలో ) ఆ కంఠ ధ్వని జగమల్లు నిది వలె నున్నది. స్వర్గమున కరిగినను సవతి పోరు తప్ప లేదని నట్లు వాచస్పతితోఁ బోర నోడి పాఱిపోయి రా నింతలో మఱల జగమల్లుఁడు డీకొన వచ్చుచున్నాఁడు. కానిమ్ము. వీనితో నొకింత పోరి చూచెదఁ గాక.

( అప్పుడు నిలు నిలు అను పద్యమును జదువుచు.

జగమల్లసాహిరాజు ప్రవేశించుచున్నాఁడు )

మాన—ఓరీ! భార్యాభుజ బల సంపద్గర్వాంధ!

ఉ. వారును వారుఁ బల్కు గరువంపు నుడుల్ విని వారి పోలికన్

బీరము లాడఁ జొచ్చితివి భీతి వహించెద నంచు నెంచి; యో
రోరి; వివేకహీన! వినవో గిరిధైర్యుఁ డటంచు నెప్పుడున్
మారుత మెంత వీచినను మందర శైలము త్రుళ్లి యాడునే?

జగ—ఛీ ఛీ! సిగ్గులేక యింకను నా యెదుట నిలిచి ప్రేలు చుంటివా? ఔను. నీకు సిగ్గెక్కడది? నీక కాదు. నీ యబ్బకుఁ గూడ సిగ్గు లేదు. ఓరీ తులువా!

గీ. మున్ను నీ తండ్రి యగ్బరు భూమి పతికి
భీతిలి సహోదరి నొసఁగి పెండ్లి చేసెఁ;
జైత్ర కాచారమును నెడఁ బాయ లేక
చెల్లెలి సలీమునకుఁ బెండ్లి చేసి తీవు.

ఓరీ! నిన్ను మానసింహుఁ డని పిలుచుట తప్పు. మఱెట్లు పిలువ వలె నన?

చ. కడు నభి మానముం గలిగి క్రాలెడి వంశము నందుఁ బుట్టుటన్
గడు నభిమానవంతుఁడవు కాఁ గల వాఁడ వటంచు నెంచి తా
లెడఁదల; మానసింహుఁడని యెల్లరుఁ బిల్చిరి గాని; గ్రామ సిం
హుఁ డనుచు నిన్ను బిల్చు నెడ నొప్పెడి నెంతయు సార్థకాఖ్యయై.

మాన—ఓరీ! ఆత్మ శ్లాఘా పరాయణా! నీ వాచాలత్వము మేర మీఱు చున్నది. ఇఁక నేను సహింపను. కాచు కొనుము.

జగ—అహః! ఏమి నీ పౌరుషము! ఇఁక నన్ను సహింప వేమి? పాపము! ఓరీ! పరాక్రమ లవ దుర్విదగ్ధా! నన్ను సహించుటకు నీ వెంతటి వాఁడవు? దేవ బ్రాహ్మణ గోహింసా పరతంత్రుఁడగు కటకుఁ దురక వానిని శరణు వేడిన నీవు నొక వీరుఁడవేనా? నీ కాలు లాలకించిన నొక్క ప్రేటున నీ కంఠ ముత్తరింప వలెనని బుద్ధి వొడము చున్నది. కా

ని నీ చరిత్రము జ్ఞప్తికి వచ్చి నప్పుడు నీపై నవ్యాజానురాగము గలుగు చున్నది. ఏమన?

చ. గరువము గోలుపోయినను, క్షాత్త్రము మాసిన సౌఖ్య మందు లే
ధర జనియించి యుంటకుఁ బ్రధాన ఫలమ్మనుచున్ దలంచియున్
దురకకుఁ గూర్మి చెల్లెలిడి తోరపు సౌఖ్యము లందుచుంటి; సం
గరమున నిన్ను ద్రుంచుటకుఁగా మనసొప్పక యున్న దక్కటా!.

మాన—ఏమీ! నాపై నిర్హేతుక జాయమాన కటాక్షము! వీరాధి వీరుని వలెనే ముచ్చటించు చుంటివే! నీ పౌరుషము గాలుంగని వారెవరు?

చ. అతుల పరాక్రమ క్రమ సమన్విత శూర కులమ్ము నందు ను
న్నతిఁ గని యుంటఁ జేసియును బ్రాకట శౌర్య బలాతి ధైర్య సం
యుత యగు నాతి భర్తవయి యుండుటఁ జేసియుఁ ద్రుళ్లుచుల్కలీ
గతిఁ జెలరేఁగి ప్రేలెదవు గాని పరాక్రమ మింత యున్నదే?.

ఓరీ! వీరంమన్యా! ఇన్ని మాట లేల?

గీ. బల పరాక్రమ ములకేమి వచ్చెఁ గాని
నయ దలఁచి చెప్పుచుంటిఁ దథ్యముగ వినుము
ఎన్న నుత్తైన నభిమాన మున్న యెడల
నిలిచి పోరుము లేకున్నఁ దొలఁగి పొమ్ము.

జగ—నీ పరాక్రమ మేమో చూత మేదీ కత్తిఁ గలుపుము!

(ఇరువురుఁ బోరుదురు. కొంత తడవునకు మానసింహుఁడు పాఱిపోవును)

జగ—ఓ వీరాధి వీరా! నీ మేనల్లుని సాయము వేడఁ బోవు చుంటివా?

( తెరలో. )

ఓహో! రాజపుత్త్ర వీరులారా! విజృంభింపుఁడు విజృంభింపుఁడు.

జగ——( అలకించి ) అదిగో వాచస్పతి యిక్లే వచ్చు చున్నాఁడు.

( అప్పుడు వాచస్పతి ప్రవేశించు చున్నాఁడు )

వాచ——దేవా! మానసింహుఁ డెంతటి వీరుఁడో యను కొంటిని. కాని వానిది మేఁకపోతు గాంభీర్యమని యెఱుంగఁజాలక పోయితిని. ఛీ ఛీ నేఁడు సిగ్గులేని వానితోఁ బోర వలసి వచ్చె.

జగ——( ఆశ్చర్యముతో )ఏమీ! సచివాగ్రణీ! వాఁడు నీతోఁ గూడఁ దల పడెనా? నాతోఁ బోరఁ జాలక వాఁడిప్పుడే పాఱిపోయి నాఁడు సుమా!

వాచ——ఏమీ! మహారాజా! మీతోడను బోరెనా? దేవా! మానసింహు నంతటి తులువ లేఁడుసుఁడీ! కానిండు. నేఁడు వానికి రెండపజయములు కలిగి నవి!

జగ——మేలు. వాచస్పతీ! మేలు! అద్భుతాత్ముని విషయమున నేఁడు వినవలసిన మాట వింటిని.

( తెరలోఁ గలకలము )

జగ——( అలకించి ) ఏమి యీకలకలము? ( చూచి ) వాచస్పతీ! ఆ కలకలమునకుఁ గారణ మేమో తెలియ కున్నది. చూచి వచ్చెద నుండుము.

( అని నిష్క్రమించుచున్నాఁడు )

వాచ——( తనలో ) అన్నా! నేఁడొక పాఱుబోతుతోఁ బోర వలసి వచ్చెఁ గదాయని నా మనము పరి పరి విధములఁ గొట్టుకొను చున్నది. జనశ్రుతివలన మానసింహోభముండు వీరాధి వీరుఁడు కానోపునని వానితోఁ దల పడితిని గాని యింత భీరుఁడని తెలిసి యుండిన మార్కొనుటయే మానియుందును. అక్కటా! నేఁడెంత మోస పోయితిని!

( తెరలో )

హా! హతోఽస్మి! హతోఽస్మి!!

వాచ—( ఆలకించి యులికిపడి ) ఈ కంఠ స్వరము మహారాజా గారిది వలె నున్నదేమి చెపుమా! ( చూచి ) ఏమిది హఠాత్తుగ మహారాజిట్లు కూలినాఁడు! దేవా! ఏమి యీయుపద్రవము!

( అని శీఘ్రముగఁ దెరలోనికి నిష్క్రమించు చున్నాఁడు )

ఇది తృతీయాంకము.

శ్రీ ర స్తు.




# సా హ సి క రా జ పు త్రి

## చ తు ర్థాం క ము.

[ సం గ్రా మ రం గ ము. ]

( జగమల్లమహారాజు మృత కళేబరముచెంత విచారముతో వాచస్పతి ప్రవేశించుచున్నాఁడు )

వాచ—హా! మహారాజా! ఆశ్రితకల్పభూజా! నిరుపమాన తేజోరాశీ! అయ్యో! మామకపోషకా! నశ్వరమగు నీ దేహమును విడిచి యానంద నిలయమున కరిగితివా? కట్టా! నీ కెట్టి మరణము సంప్రాప్తించెను! నిజసైన్యపరాక్రమక్రమము నరయుచు నిశ్చలముగనొకచో నిలిచియున్న నీపై దొంగతనముగ బాణమును విడుచుట కా మహమ్మదీయ హాతకునకుఁ జే యెట్లాడెను! అక్కటా! ఈ తురుష్కు లెంత దాష్ట్యమున కొడి గట్టి నారు! అయ్యో! ధర్మపరావతారా! అక్రమమగు నీ యకాల మరణము నీ కేల ప్రాప్తింపవలెను! ఓ సర్వేశ్వరా!

మ. ఘన భక్తిం నిను గొల్వ నట్టి దిన మొక్కండైన లే; దన్య కాంతను దల్లిం బలెఁ జూచు వాఁ డెప్పుడు డెంద మ్మందు సద్భక్తితో
మను మార్గమ్ముఁ బరిత్యజింపకయె సామ్రాజ్యమ్ముఁ బాలించె న
ట్టి నరాధీశ్వరు నిట్లు చేసితివె తండ్రీ! దీనకల్పద్రుమా!

ఓ దేవా! పాపాత్ములకు జయము గూర్చెదవు. ధర్మ మార్గ ప్రవ

త్రకుల కపజయము గల్గించెవు. నీ కిది తగునా? ఇప్పుడీ మే
రాజ్యము నేమి సేయఁ దలంచితివి? మహారాజు "తురకలతో సంధి
యక కంఠములోఁ బ్రాణము లున్నంత వఱకు యుద్ధమే చేసెద"
నాచేఁ జేతిలోఁ జేయి వేయించుకొని నాఁడు! మహారాణికిఁగూడ "
పరులతో సంధి సేయక జీవితాంతము వఱకుఁ బోరాడు" మని సం
ము నొసఁగినాఁడు. పరులకు సామంతులై రను నపయశము సిసో
దియా వంశము వారికిఁ గలుగ నీయవలెనని మహాభారమును నా
పురపై మోపినాఁడు! రాణి యేమిచేయునో తెలియదు. సైనికులు
ల్లి వెను దీసెదరో, తను ప్రభుని జంపిన పగఁ దీర్చికొన ప్రయత్ని
గో యూహింపరాదు. మహారాజు ప్రాణములు విడుచు వఱకును
గావస్థలోనున్న యీ మహాసంగ్రామవిజయ మిప్పుడు తురుష్కుల
గు ననియే తోఁచుచున్నది. జయ మెల్లెడనను నే నియ్యెడఁ జేయ
లసిన పని యేమో తెలియకున్నది. కటకటా! నా కెట్టి దురవస్థ
సించినది.

( తెరలో )

ఓహో! రాజపుత్ర వీరులారా! విజృంభింపుఁడు విజృంభింపుఁడు!
దే సమయము. చంపుఁడు. దేవ బ్రాహ్మణ గోహింసా పరతంత్రుల
తురుష్కులను జంపుఁడు చంపుఁడు.

వాచ—( ఆలకించి యులికి పడి తనలో ) మహారాజు పడిన
ర్త మహారాణి కింకను దెలియ లేదు. ఆ సాధ్వి యింకను సైనికుల
ప్రోత్సాహము గలిగించుచున్నది. ( ముందుకుఁ జూచి ) అదిగో
మహిళావతంస మిక్కడ వచ్చుచున్నది. కటకటా! మహారాజు పడిన
ర్త నా సతీమణి కే నెట్లు చెప్పుదును? ఓ యీశ్వరా! కోలం బెఱిఁ
చు మిషచే మహారాజు ప్రాణములను నా చేతనే తీయించితివి. ఇప్పు

మహారాణి కమంగళ వార్త గూడ నా చేతనే చెప్పింపఁ దలఁచితివా? కట్టా! నీ చెయిదముల కడ్డు లేదు.

(అప్పుడు రామాబాయి ప్రవేశించుచున్నది)

రామా—వాచస్పతీ! నీ వట్లు కుందుచుంటివేమి? ఆ పడియున్న వారెవరు? నీ వట్లు వగచెద వేల?

వాచ—హా! మహారాణీ! ఇఁక నేమున్నది?

(అని శవము దెసకుఁ జూచుచున్నాఁడు)

రామా—(శవము దెసఁ జూచి) హా! నాథా!

(అని మూర్ఛిల్లుచున్నది)

వాచ—కటకటా!

గీ. కనఁగ దేవేరి నామాట వినెనొ లేదొ
కాంతు మృత కళేబరమును గనెనొ లేదొ
అక్కటా! యంతలోన హా యనుచు నేలఁ
గూలె హతమూల మైనట్టి కుజము పోల్కి.

అయ్యో! మహారాణి యవస్థం గనిన నా హృదయము వ్రక్కలై పోవుచున్నది! కట్టా! దేవేరి యింకను దెప్పిరిల్లకున్నది. ప్రాణములు కడఁబట్టి యుండవు గద?

రామా—(మూర్ఛనుండి లేచి) హా! జీవితేశ్వరా!

చ. యవనుల నుగ్గు సేసెడి దళాధిపతిన్ బురికొల్ప నేఁడు న
య్యవసరమందునిల్చి యిట నాహవముంగనుచుంటి వెంతో యు
త్సవమునఁ; గ్రచ్చరన్ దిరిగి త్వత్స్వర సన్నిధిఁ జేరునంత ని
ప్పవిది రణావనీస్థలినిఁ బ్రాణములన్ విడనాడితే కటా!

హా వీరాధిపీరా! అయ్యో? ప్రాణేశ్వరా! ఏ కాంత సంతతము నీ చెంత లేకున్నఁ బెన్నిధిఁ గోల్పోయిన పేద చందంబున స్వస్థత లేకుండు

వో, యే కాంతను "మరాళగమనా! నీ ముఖేందు మండల దర్శనము చే నా హృదయ జలధి యెంతయు నుప్పొంగు" నని బుజ్జగింతువో, యే కాంత పరాక్రమ లేశమును, నిష్కళంకాభిమానమును గాంచి "అరా శకుంతలా! నీవు క్షత్త్రియ కుల భూషణురాలవై సిసోదియా వంశ మెంతేని వెలుంగఁ బుట్టిన తేజోరాశివి సుమా" యని కొండాడెదవో, యే కాంత నిన్నే సర్వముగా నెంచి శక్తివంచన లేకుండ నీ పాద పద్మముల ను బూజించుచున్నదో, యట్టి నీ సేవకురాలైన రామాబాయి యిది గో వచ్చియున్నది.

ఉ. అక్కట! ప్రాణనాథ! నను నాఁసి నంతన హర్ష మాంత్మలో
నెక్కొన నాదరమ్ము మెఱి నెయ్యముఁ జూపవు; లేఁత నవ్వునీ
చెక్కులఁ జెంగలింప దయ చిప్పిలు కన్నులు విచ్చి వేడ్క నా
ప్రక్కకుఁ జూడవేమి యొక పల్కును బల్క వి దేమి వల్లభా!

వాచ—(తనలో) కట్టా! ఏమి నా దురవస్థ!

గీ. రాణి సుంతైన శోకింప మానకుండె
నడలకుఁ డనంగ నాకు నోరాడ కుండె
వైరి సైన్యము పేర్చి పైఁ బడుచు నుండెఁ
జెల్లరే! యిప్పు డే నేమి చేయు వాఁడ?

రామా—హా త్రిభువన పరాక్రమధౌరేయా!

సీ. కలలోన నైన నవ్వులకైన నా మీఁద
నింతైనఁ గోపించి యెఱుఁగ వెపుడు
రాజకీయంపుఁ గార్యములందు నైతము
నా యిచ్ఛఁ గొనకుండ నడువ వెపుడు
కష్టమైనను నాదు కామితమ్మును దీర్ప
లలి యుత్సవముగాఁ దలఁతు వెపుడు

స్వాప్నమైన మదీయ శౌర్యమ్ము నరసి య
మంద సమ్మోదమ్ము నందె దెపుడు
గీ. నన్ను నొక గడె చూడక యున్నఁ బెన్ని
ధానమును గోలు పోయిన వాని భంగి
లేశమైనను స్వస్థత లేక యుందు
వట్టి నీ వింక నను బాసి యెట్టు లుందు?

కటకటా! ప్రజాహిత తత్పరా! మన స్వాతంత్ర్యమును హరింప వచ్చిన యక్బరుని జయించెదవు. ప్రజలు తులలేని సౌఖ్య సంతోషముల నందఁ బెద్ద కాలము మేవాడు రాజ్యమును బరిపాలించెద వనుకొంటిని గాని యిట్లు మమ్ము ట్లగాధమగు నాప త్సముద్రమున ముంచి వైచెద వని కలలోనైనఁ దలపోసి యుండలేదు. నిర్భాగ్యురాల నగు నేను నీ కర్ధాంగినై యుండ నీ కట్టి భాగ్య మెట్లబ్బును!

( తెరలో )

హా జనకా!

రామా—( ముందుకుఁ జూచి ) అయ్యో! ముద్దు బిడ్డలారా! ఇం కెక్కడి జనకుఁడు!

( అప్పు డతివేగమునఁ జంద్రావతీ లీలావతులు ప్రవేశించి తండ్రి మృతకళేబరముపైఁ బడి హా జనకా! యని మూర్ఛిల్లుచున్నారు )

రామా—హా నాథా!

సీ. ఏవ్వారిఁ బొడఁగన్న నింతింత యనరాని
ముద మంది యుప్పొంగి పోవుచుందొ
యెవ్వారిఁ గని పుత్త్ర హీనుల మనుమాట
కల్ల యంచును నుల్ల సిల్లు చుందొ

ఈశాన్యాది సామర్థ్య మిూక్షించి రాజ్యమ్ముఁ
బాలింపఁ గలఁ డంచుఁ బలుకు చుందో
ఈశాన్వాది యత్నమాన మిూక్షించి సాత్ర తే
బో ముఖ్యు లంచుఁ బ్రస్తుతి సలిపెదో

గీ. ఎవరు నీ కృపా పాత్రులై యొసఁగు చుందు
రట్టి నీ కుమారి పుత్త్రిక లెసుగు డెంచి
తోరముగ నంగలార్చు చున్నార లిపినా!
మాట వేమి? నోరార మాటాడ వేమి?

ప్రభా—(మూర్ఛ నుండి లేచి) కటకటా! నేఁటి ప్రొద్దున యుద్ధ సన్నద్ధుఁడవై మా జనని కాలికు వేచి యున్న లేటి పోకరియు నేనును మ్రొక్కఁ దీవించి "ఓహో నాయనుఁగు బిడ్డలారా! మిన్న మన్న గానక విపిన పడుచున్న శత్రుకలను నేఁటితోఁ గాలుఁ బ్రోలెక్కుమని నీవు చెప్పిన మాటలే మాకుఁ గడ మాట లాయెనా? అయ్యో! పుత్త్రికా వత్సలా!

గీ. జనక! మే మెప్పుడైన హస్తమ్ము లెక్కి
యున్నఁ బరి పరి విధముల నున్నారిచెదు
విపుడు నీ కడిగోలుచు నేడ్చు చుండఁ
గనఁగఁ గన్నార నైనను గన వదేమి?

చంద్రా—హా! జనక! మా శౌర్య సాహసములం గాంచియు, సంగీత సాహిత్య వైదగ్ధ్యము నరసియుఁ దెలివి తేటలను జూచియు సమం దానంద కందళిత హృదయార విందుఁడవై మము బుజ్జగించు చుండెడి వాఁడవు? అయ్యో! ఇంక మముఁ గాంచి యానందించు వారెవరు? మమ్మెవ్వరి కప్పగించి పోయితివి! కటకటా! మా కెట్టి దురవస్థ నెట్టసించితివి!

రామా—హా! వీరాధి వీరా! వైరి యోధాన యోధ శుష్క విపుల విపిన దావానలా! అయ్యో! జీవితేశ్వరా!

సీ. అతి సమ్మోదమున నోరారఁ బ్రేమమునఁ బ్రా
ణేశ్వరీ యని పిల్చు టింక లేదు
రాజకీయంపుఁ గార్యముల నీ యాలోచ
మ్మనుచుఁ బృచ్ఛించు టింక లేదు
ఎలమి నాయుద్ధకౌశలముఁ గాంచి వహవ్వా
రే యంచుఁ గొండాడు టింక లేదు
మెలఁత! వయ్యాను విద్య మించితి నన్నంచు
నెంతేనిఁ గొని యాడు టింక లేదు

గీ. యుక్తిపై యుక్తి నాలించి భక్తిఁ జూచి
శౌర్యమును జూచి నా సాహసమ్ము గాంచి
యీప్సితముఁ దీర్చి నద్రోచు టింక లేదు
కటకటా! నా కికఁ బ్రపంచకమ్ము లేదు.

చంద్రా—హా జననీ! భువనైక పతివ్రతా మణీ! మన మీ యాపత్సముద్రమును దాటు టెట్లో గదా?

రామా—అయ్యో! వెఱ్ఱిదానా! ఇంకను మన మీ యాపత్సముద్రమును దాటుటా? ఇఁక మనము దాటఁ బోవు నది వైతరణియే.

వాచ—కష్టా! అమంగళము ప్రతిహత మగుఁగాక! అమంగళము ప్రతిహత మగుఁగాక. మహారాణీ! క్షత్రియ కుల భూషణులగు మీ రట్లు పలుకఁ దగునా?

రామా—ఓ వాచస్పతీ! ఇంకను శాస్త్రమా! వెఱ్ఱివాడా!

గీ. ధవుఁడు లేనట్టి సతికిఁ బ్రతాప మేల?
ప్రాణపతి లేని గరితకు రాజ్యమేల?
మగఁడు లేనట్టి చెలి కభిమానమేల?
నాథుఁడే లేని కాంతకు శాస్త్రమేల?

కావున నిశ్చల చిత్తముతో నేను నా జీవితేశ్వరుని సన్నిధి కరిగెద. నీ వేమియు ననక యూరకుండుము.

( అని యాత్మహత్యఁ జేసికొనుటకుఁ గత్తి నవరించుచున్నది )

చంద్రి,—లీలా—జననీజనకులు లేని మాకీ హేయపు బ్రతుకేల?

( అని కటారులచేఁ బొడుచుకొనఁ బోవుచున్నారు )

వాచ—ఆఁ! అఁ! మహారాణీ! నీప్రాణేశ్వరుని యాజ్ఞను జవదాఁటెదవా? ఓ రాజపుత్త్రికలారా! మీ జనకుని దిరస్కరించెదరా?

రామా—( ఆత్మహత్యఁ జేసికొనుట మగాని ) ఏమీ? వాచస్పతీ! నా ప్రాణేశ్వరుఁడు ప్రాణములను విడుచు నప్పుడు నా కేమైన యాన తిచ్చెనా?

వాచ—మహారాణీ! త్వరపడిన నే నేమి చెప్పువాఁడ? మహారాజు మీ మీఁద గొప్ప భారము నుంచి పోయెను.

రామా—నా భర్త నా కేద్దియో విధించి పోయెనని యెఱుంగఁజాలక యకృత్యమును జేయఁ బూనితిని. వాచస్పతీ! జాలమేల? నా నాథుని కడపటి పల్కులను వినిపింపుము.

చంద్రి—వాచస్పతీ! మా తండ్రి మా కేమియుఁ జెప్పలేదా?

వాచ—అమ్మా! మీకుఁ దగిన మాటలు చెప్పినాఁడు.

లీలా—ఏమి చెప్పినాఁడు? యుద్ధము సేయుఁడని చెప్పెనా లేదా?

వాచ—అమ్మా! అంత త్వరపడిన నే నేమి చెప్పఁగలను?

చంద్రి—త్వరపడ నక్కఱలేదు. మా జనకుఁడు మా కేమేమి చెప్పెనో నెమ్మదిగనే చెప్పుము.

రామా—తండ్రి సందేశము నాలింపఁ ద్వరపడుచున్న నా ముద్దుబిడ్డలకే ముందుఁ జెప్పుము.

వాచ—ఓ రాజపుత్త్రికలారా! ఆలకింపుఁడు. „ ఓ పసికూనలా

రా! మీ పెండ్లి పేరంటములం గావించియు మీ సుఖ సంతోషములం గాంచియు నానంద వార్ధి నోలాడు భాగ్యము నాకు లేదు. నేనిప్పు డవ్వ యమైన శాంతి స్థానమునకుఁ బోవుచున్నాఁడ. మీ కేను చెప్ప వలసిన దేమియు లేదు. వివేక ధురీణురాలగు మీ యమ్మ యాజ్ఞానుసారము ప్రవర్తింపుఁడు" అని మహారాజు మీకుఁ జెప్పుమనియెను.

చంద్రా--చెల్లెలా! వింటివా జనకుని సందేశము?

లీలా--అక్కా! వినుట కేమున్నది? ఏమేమో చెప్పెను గాని యుద్ధ విషయము మాత్రము చెప్పలేదు. మనము పోరఁ జాల మనుకొని యెఁ గాఁబోలు!

చంద్రా--సోదరీ! అట్లు గాదు.

సీ. కత్తిచేఁ బట్టి చక్రమ్మట్లు దిర్దిర
గరిడీ సేయుటఁ దాను గాంచలేదొ
గుఱివెట్టి శరమున గుర్తును వేగఁ దా
టించు నెప్పుడు దాను గాంచలేదొ
అలరుచుఁ గృత్తి మహాహవ రంగమునఁ బేర్చి
సంచరించుటఁ దాను గాంచలేదొ
వీరనారి యటంచుఁ బేర్వడ్డ జననితో
మించి పోరుటఁ దాను గాంచలేదొ

గీ. ప్రజ్ఞఁ గన లేదొ రాజ్య తంత్ర మ్మెఱుఁగమొ
చలము సాధించు రాచ కన్నెలము గామొ
కటకటా! మన తండ్రి సంగరము సేయ
సెలవు నీయని కత మేమొ తెలియరాదు.

లీలా--అక్కా! ఇంతవఱకును మన మెన్నఁడును జనకుని యాజ్ఞ ను జవ దాఁటి యెఱుఁగము. కాని యిపుడు మాత్రము జవదాఁట వలె

ను. ఏమనఁ?

గీ. చాలఁ గాలము నుండి కష్టముల నెల్ల
నోర్చి నేర్చితి మొక్కింత యుద్ధవిద్య;
ప్రబల సంగ్రామ మిపుడు సంప్రాప్త మయ్యె
నిపుడు గాకున్న వినియోగ మెప్పు డింక?

చంద్రా—చెల్లెలా! అట్లుగాదు. మనల నమ్మ యాజ్ఞచొప్పునఁ బ్రవర్తింపుఁ డని జనకుఁడు విధించెఁ గదా? కావున జననినే యుద్ధము సేయ సెలవు గోరుదము.

లీలా—అమ్మా! మాకుఁ గూడ యుద్ధము సేయ సెలవొసఁగుము.

రామా—బిడ్డా! మీ జనకుఁడు నాకేమి విధించెనో వినిపించెదవా?

చంద్రా—మా జననికిఁ జెప్పుమనిన తండ్రిగారి సందేశమును వేగ వినిపింపుము.

వాచ—మహారాణీ! ఆలకింపుము. "ప్రాణేశ్వరీ! నేటితో నా యాయుర్దాయ మంతమైనది. మహమ్మదీయ సైన్యము నుండి వచ్చిన యొక క్రూర నారాచముచే నేను ప్రాణములం దొఱంగుచున్నాఁడ. ఈ యుద్ధపుఁ బరిణామమును గన్నులారఁ గాంచు భాగ్యము నాకు లేదు. నా యర్థాంగలక్ష్మివైన నిన్ను జూచు భాగ్యము గూడ నాకు లేదు. నా మరణమునకు నీ వెంత మాత్రమును విచారింప వలదు. అట్లయిన నాకు సద్గతి గలుగును. నా యందు నీ కెట్టి భక్త్యనురాగము లున్నవో పరీక్షింపఁబడు కాలము వచ్చినది. నా మృతికిఁ గారణుఁ డక్బరు. కావున నక్బరు నీకుఁ బ్రబల శత్రుఁడు. అట్టి శత్రుని విషయమున నెట్లు ప్రవర్తింప వలెనో రాజపుత్త్ర కాంతవగు నీకుఁ జెప్ప నక్కఱలేదు. అయినను జెప్పుచున్నాఁడను. జయాపజయములు దైవాధీనములు. సిసోదియా వంశము వా రింతవఱకుఁ బరులకు సామంతులై కప్పము నొసంగు

నంతటి నైచ్యమునకుఁ బాల్పడి యుండలేను. అట్టి సర్వాంశము వారికిఁ బ రులకు సామంతులైనను నపయశమును గలుగ నీయకుండు భారము నీ యందున్నది. ఇంకలి రహస్య మిది. రాజ్యము పోవుఁ గాక. ప్రాణమే పోవుఁ గాక. ఎట్టి యవస్థ తటస్థించినను సంధి కోడం బడఁ గూడదు. ఆ ట్లయిన నా మనస్సునకు శాంతి కలుగును. క్షత్రియ స్త్రీ వగు నీ వీ యుత్కృష్ట కార్య నిర్వాహణము నందు వెను దీసెద వని తలంపను. కా ని "యీ కార్యము నీ విధి కృత్యము సుమా" యని మాత్రము మ ఱి యొకసారి చెప్పుచున్నాను. ఇంకొకటి. మన యనుంగుఁ బుత్రిక లైన చంద్రావతీ లీలావతులకుఁ బెండ్లి పేరంటములం గావించి వారి యా నందమును గాంచి యానందించు భాగ్యము నాకు లేదు. నీ విప్పుడు చే యుచున్న దారుణ సంగ్రామమున నీకు సంభవింప నున్న జయాపజయ ముల కనుగుణముగ మన ముద్దు బిడ్డలను బాలింపుము. క్షత్రియ కాం తవును బతివ్రతవునగు నీ కింత కంటె నధికముగఁ జెప్పనక్కఱలేదు" అని.

రామా—సచివవర్యా! నా జీవితేశ్వరుఁ డింతటి కార్య నిర్వాహణ భారమును నాపైఁ బెట్టెనని యెఱుంగ లేక పోయితిని. రాజ్యము పో యినను బ్రాణము పోయినను సంధి కొడంబడక కడవరకు బ్రాణము లున్నంత వఱకు సంగ్రామమునే సేయుమని నా నాథుం డాజ్ఞాపించెను. నాకిఁక సెలవిమ్ము.

గీ. విభుని మదియందు శాంతిని వెలయఁ జేయ
ఘన సిసోదియా వంశ పావనత నిలుప
క్షాత్ర తేజమ్ము మిగులఁ బ్రకాశ మంద
నశ్వరుని బ్రముంతుఁ బ్రాణేశు నాజ్ఞ కలిమి.

ఛంద్రా—జననీ! మాకుఁ గూడ సెలవిమ్ము.

రామా—ఓ నా ముద్దు బిడ్డలారా! నర్వముకకు నే నుదిడ మీ

రు కష్ట పడనేల?

చంద్రా—అమ్మా! అట్లు గాదు. (ఆత్మోక్తి)

లీలా—తల్లీ! ఇన్ని గేల చెప్పెదవు? మాకు శౌర్యస
తయ యనియా, ప్రతాపము తక్కువనియా, ధైర్యము కొఱ
యా నీ తలంపు? అట్లైన నీ వీ చతురంగ బలములతోడను
స త్తముని తోడను వెనుక నుండుము.

మ. ప్రథితాస్మత్ప్రథ బాహువిక్రమకళా ప్రావీణ్య మేపా
ప్రబధనక్షోణితలమ్ము నక్షరహిత విహార మ్మొనుగావింతు
మ్మథ నాహార్య నిపాత మాత్రమున భీ మాస్త్రక్రియాదుర్గ నిర్
బుధి ఘూర్ణిల్లెడి పోల్కి యానన బలాంభోరాశి ఘూ

రామా—లీలావతీ!

గీ. ధైర్య మధికమ్ము బలియుఁ బెంశౌర్య మరయఁ
గలదు మీకెంత యైనను గాని; కష్ట
సముల బడు దాన నే నుండ సౌఖ్య వితతి
ననుభవింపక మీకేల యని యొకర్వ?

లీలా—ప్రియ జననీ! అట్లైన మా కీ యుద్ధవిద్య నేల
రి? మేము కష్టపడకుండ సౌఖ్యముల ననుభవింప వలయునని మీ
రైనచో మా కీవిద్యలన్ని టిని నేర్పింపక రాణివాసమునం గట్టి
చో నజ్ఞానాంధకారమునంబడి సౌఖ్యరూపక కష్టముల ననుభ
మీ కోరికఁ దీర్చిన వారమగుదుమే!

రామా—ఓ ముద్దుబిడ్డా! ఇంత మా ప్రేమునకు న న్నే
దవు? (అర్థోక్తి)

లీలా—

గీ. బలము, శౌర్యమ్ము, ధైర్యము కలదు గాని

సమరమును జేయ మా కదృష్టమ్ము లేదు
అనుచు మమ్ముఁ నిందించుకొనక యకట!
జనని! నిన్ననసేల నిష్కారణముగ?

వాచ — రాజపుత్త్రి! నిష్కారణముగ నిట్లేల పరుష భాష లాడెదవు? ఇంకను రాజపుత్త్రికలగు మీరు సైతము పోరవలసిన ర మాసన్నమై యుండలేదు అట్టి యవసర ముపస్థిత మైనచో స బతిమాలి మీ చే యుద్ధముఁ జేయించెదము.

చంద్రా — వాచస్పతీ! నీవు కల్లపొల్లుమాటలచే మమ్మేలయు పజూచెదవు? మేము యుద్ధము చేయవలసిన యవసరమింకను రా

గీ. ఆలమునఁ బ్రియ జనకుండు గూలె నకట!
దళము ఝల్లిల్లు చుండెను తాల్మి దక్కి
మించి వైరి వీరులు విజృంభించు చుండ్రి
సమకురునె యింత కన్నను సమయ మరయ.

లీలా — అదియుఁ గాక, వాచస్పతీ! "రాజపుత్త్రికలగు సైతము పోరవలసిన యవసరము తటస్థించి యుండలేద" ని వ మా యాధిక్యము గలుగఁ జేయుచుంటివి!

గీ. మంత్రి! మేవాడు రాజ్యసీమమ్ము లందుఁ
గల ప్రజ లెల్ల మే మేలికలము గాని
వసుధ నెల్లఱ చేతఁ గైవారములను
గనెడి స్వాతంత్ర్యమునకు లెంకలము గామె?

కావున మా యక్క చెప్పినట్లిప్పుడు మేము పోరవలసిన సమయ

రామా — నా పెన్నిధానములారా! ఇంత వఱకును మీ మాట నతిక్రమించి యెఱుంగరు గదా? ఇప్పు డీ యొక మాటః డ గౌరవింపుఁడు.

గీ. అరులపైఁ బడి నాదు సాహసమును గడ
వలెనుఁ జూపెగ; నా కోర్కె వ్యర్థమైన
నగ్నిలోఁ బడి మీదు సాహసము నంతఁ
జూపుఁడీ! ప్రజ లెల్లను స్తుతి యొసర్ప.

చంద్రా—చెల్లెలా!

గీ. కలదు శౌర్య మ్మదెంతైనఁ గలదు బలము
కలదు సాహస మెంతేనిఁ గలదు తాల్మి
ఎట్టి శౌర్యాదు లుండిన నేమి? లోభి
వాని ధనమయ్యె మన కున్న వాఁడి యుపుడు.

లీలా—అక్కా! ఇక మన కిక్కడ నేమి పని యున్నది? గృహ మునకుఁ బోయి యొక మూలఁ గూర్చుండవము రమ్ము.

( అని యిరువురు కోపముతో నిష్క్రమింతురు )

రామా—వాచస్పతీ! ఇంకను జాలమేల?

ఉ. తమ్ము విచారమున్ దొలఁగి; లీలఁగ ఖడ్గముఁ జేతఁ బట్టి, చి
త్తమ్మున నిష్కళంకమగు ధైర్యము దాల్చి బిరాన; దుష్ట మా
ర్గమ్మున నా మనోహరుని ప్రాణము బాపిన సూడు దీర్ప రా
రమ్ము మహాహవమ్మున నరాతి గణమ్ముల మట్టు వెట్టఁగన్.

వాచ—మహారాణీ! నేను సిద్ధముగ నున్నాఁడను.

రామా—వాచస్పతీ! నా శరీరమునందలి కుడిభాగము నా భర్త కావున నా ప్రాణేశ్వరుని ప్రచండ కరవాలమును నాకుడిచేతఁ బట్టి యు ద్ధమునకై వెడలెద. ఈ నడుమ నెవరైన శత్రు లడ్డినచో నాతుచ్ఛుల నస్మ త్కరవాలమున కెరచేసెద. రమ్ము. (అందఱు నిష్క్రమించుచున్నారు)

ఇది చతుర్థాంకము.

శ్రీ ర స్తు.

# సాహసిక రాజపుత్త్రిము.

## పంచమాంకము.

[ మహమ్మదీయ స్కంధావారము. ]

( అక్బరు, మానసింహుడు ప్రవేశింతురు )

అక్బ—మానసింహా! మన సైనికుల ధైర్యోత్సాహము లెట్లున్నవి?

మాన—సార్వభౌమా! పరాక్రమ లవ దుర్విదగ్ధుడై హిందూదేశ చక్రవర్తు లగు దేవర వారిని ధిక్కరించి మార్కొనిన యుదయపుర రాణా కూలి పోవ మన సైనికుల ధైర్యోత్సాహముల కేమి కొఱత?

గీ. చెనటి జగమల్లు కూలుటఁ జేసి హాళి
మీఱఁ జంగు చంగున మన వీర భటులు
కరి కులమ్మున దూఁకు సింగమ్ము లట్లు
లుఱుకు చున్నారు రిపు వీర వరుల పైకి.

అక్బ—ఏమీ? మానసింహా! మేవాడు రాణా కూలినాఁడా!

మాన—చిత్తము. మొదలు నఱికిన యరఁటి చెట్టువలెఁ గూలినాఁడు! ఓ ప్రభువా!

ఉ. ఓ రజనీ కరధ్వజ! నయోన్నత మార్గ మెఱుంగ కుండినన్
ధీర బలాఢ్యులందు గణుతింపఁగనౌ జగమల్లు; నిప్పుడా
వీరవరుండు కయ్యమున వీడెను ప్రాణముఁగాన, మీకుఁ గ

౧ రసపుత్ర వీరులిఁకఁ గోరలు పీఁకిన త్రాఁచులే గదా?

(తెరలో)

ఓ పాదుషా పట కుటీర రక్షక భటులారా! జాగ్రత్త జాగ్రత్త. పతి విరహిత యగు రామాబాయి

ఉ. కాంతుని రూపు మాపిన పగన్ వడిఁ దీర్పఁగ మ్లేచ్ఛ సైనికా
భ్యంతర సీమకుం దడరి వాలము ద్రొక్కిన త్రాఁచు మాడ్కి న
య్యంతకు నంతికమ్మునకు నంపుచు నుండెను బంట్ల; పాదుషా
చెంతకుఁ జేరనీయకుఁడు చేరఁగ నిచ్చిన గీడు మూఁడెడిన్.

అగ్బ—(ఆశ్చర్యముతో) ఏమీ! రామాబాయి యిట్లే వచ్చుచున్నదా? (ఎదుటఁ జూచి) ఆశ్చర్య మాశ్చర్యము!

ఉ. చూడుము చూడుమద్దెసకుఁ జోద్యము గల్గెడి మానసింహ! యా
చ్చేడియ పూరుషుం బలె చెచ్చెర ఖడ్గము ద్రిప్పుకొంచుఁ జెం
డాడుచు బంటులన్ గడు రయమ్మున దూఁకుచు జీవితేచ్ఛయున్
వీడి ననున్ వధించుటకు వేఁ జనుదెంచెడి రక్త నేత్రయై.

మాన—ఔరా! ఏమీ యామె యౌద్ధత్యము!

అగ్బ—ఆహా! ఆశ్చర్యము!

గీ. కన్బడెడు వామ కరమునఁ గల కటారి
గొలుకలుఁ గాన్పించుఁ గుడి చేతి నున్న కత్తి
చేరఁ బోయిన తురకల శిరము లెల్లఁ
బుడమి పైఁ బడుఁ గొబ్బరి పుచ్చె లట్లు.

మానసింహా! మన భటు లందఱు కూలు చుండఁ జూచెద వేమి? ఆమెను బట్టి బంధింపుము.

మాన—చిత్తము. ఇదిగోఁ బోవుచుంటి.

(అని నిష్క్రమించును)

( తెరలో ) ఓరోరీ! మానసింహాధమా?

గీ. తులువ! న న్నెవ్వరంచును దలఁచు చుంటివి?
సంకరము గాని యుత్తమ క్షత్త్రియాన్వ
యమ్ము వెలుఁగఁ బుట్టిన దాన సుమ్ము నీకు
శౌర్య మింతయు నా కడ సాగిరాదు.

అక్బ—( ఆశ్చర్యముతోఁ దనలో ) ఆహా! బాల్యము నుండియు నే ననేక యుద్ధములం జేసితిని గాని యిట్టి యుద్ధము నెన్నఁడును జూచి యుండలేదు. ఈ సంగ్రామ మాటితేటిన నాకే భీతి గొల్పుచున్నది.

గీ. అప జయము గల్గు నిపుడు పోరాడ కున్న
మగువతోఁ బోరు సల్పుట తగవు గాదు
సంధి సేయుద మన్నఁ బోసంగ దిపుడు
చెల్లరే! యింక నే నేమి సేయువాఁడ?

( అంత రామాబాయి, మానసింహుఁడు, కొండలు మహమ్మదీయ సైనికులు ప్రవేశింతురు )

రామా—ఓరీ! క్షత్త్రియ కుల కలంకా!

గీ. వాలు కేలను ధరియించి వైరి యెదుట
నిలిచి పోరాడ కుండుట నీతిగాదు
ఏల చూచెద వట్లు? నీ కేమయినఁ బ్ర
తాప మున్నచో రవ్వంత చూపు మిపుడు.

మాన—అక్బరు చక్రవర్తీ!

గీ. వదరు చున్నది యీకాంత కదన మనుచు
మాటి మాటికి జత లేని పోటరి వలె
నొక్క నిముసమ్ము నా కాజ్ఞ నొసఁగు మయ్య!
చూపి వచ్చెద నాదు ప్రతాప మింత.

అక్బ—ఏమీ? కాంతతోఁ బోర నన్ను సెల వడుగు చుంటినా?

రామా—ఓరోరి! మానసింహ పాతకా! నీ వింత సిగ్గు లేని వాఁడ వని యిదివఱకే నెఱుంగక పోయితిని. క్షత్త్రియ కులమునఁ బుట్టి యుద్ధము సేయఁ దురుష్కుని సెలవడుగుటకు నీకు నో రెట్లాడెనురా? ఛీ ఛీ! నీచాతి నీచుఁడవు. పాపాత్ముఁడవు. మానాభిమానములు లేని వాఁడవు. నీ మొగముఁ జూచినఁ బాతకము చుట్టుకొనును. ఓరీ! నా యెదుట నుండి తొలంగి పొమ్ము.

మాన—(నిష్క్రమించుచున్నాఁడు)

రామా—ఓ అక్బర్!

గీ. ధైర్య బలశాలివంట! యవార్య శౌర్య
వంతుఁడవుగంట! యభిమానవంతుఁడవఁట!
తురకవీరుని కూర్మి పుత్త్రుఁడవు నంట!
కత్తిఁ గలుపుమి చూతు నీ సత్తువేమొ?

అక్బ—ఓ కాంతా! నీ వబల వగుటచే నీ యాహ్వానమున కంగీకరింపఁ జాలను. నీ వబలవే కాకున్న నిన్నే నే నాహ్వానము గావించి యుందును. నీ వతివవే కాకున్న నిట్లు వదర నిత్తునా?

రామా—ఆహా! ఎవఁడో యొక వీరుఁడు “నాకుఁ దోఁక లేదు గాని యాంజనేయుని యంతటి వాఁడ” నన్నాఁడఁట! ఇది యట్లున్నది. ఓ యవన వీరుఁడా! నే నాఁడు దాన నని నీకు సందియ మక్కఱ లేదు. నేను క్షత్త్రియ కాంతను. క్షత్త్రియ కాంత పురుషునితోఁ దుల్యయైనది. ప్రాణము వోవు నేమో యని నాకు భీతి లేదు. ప్రాణము నిల్చెనా? నిన్ను గెలిచి ఢిల్లీని వశము చేసికొని యఖండ సామ్రాజ్య మ్మంతయు విలాసముగ నేలెద. ప్రాణము పోయె నేని నక్షయ శాంతి స్థానమున నఖండానంద లహరి నోలలాడు చున్న నా ప్రాణేశ్వరునిం గలసి కొనియెద.

## పంచమాంకము.

కావున సంగర మన్న నైనను నాకు సంబరమే. కావున పోరఁ గడంగుదము.

అగ్బ— ఓ క్షాత్రకులాభరణమా! నీవు క్షత్రియ కాంతవైన నద్యోకవు గాక. వీరనారి వైన నగుదువు గాక. నీకు సంగర మన్న సంబరమైన నగుఁ గాక. కాని హిందూ దేశ చక్రవర్తి నగు నే నతివతోఁ బోరాడు నంతటి నైచ్యమునకు లోఁబడను సుమా!

రాణా!— ఏమీ? నీవు హిందూ దేశ చక్రవర్తివా? ఎంత సాహస మెంత సాహసము! ఓయీ! నీ మాటల దారిఁ జూడఁ జక్రవర్తి యన నర్థ మేమో యెఱుంగ నట్లు తోఁచుచున్నది. ఒక దేశమునకుఁ జక్రవర్తి యనిన నా దేశము నందలి సకల ధరావరుల నదిమి కప్పములం గొనుచు నిరంకుశాధికారముం జెల్లించు వాఁడని గదా? ఏదీ నీ నిరంకుశాధికార మెక్కడ వెలుఁగుచున్నది?

సీ. రణశూరురాలైన దుర్గావతి కడు స్వతం
త్రించి రాజ్యమ్ముఁ బాలించు చుండె
దురకతేఁడగు విజాపుర నవాబును స్వతం
త్రించి రాజ్యమ్ముఁ బాలించు చుండె
ఘనుఁడైన గోల్కొండ మనుజేంద్రుఁడును స్వతం
త్రించి రాజ్యమ్ముఁ బాలించు చుండె
నీ బందుగులు దక్క నిఖిల రాజన్యులు
మించి రాజ్యమ్ముఁ బాలించు చుండ్రి
గీ. తొడరి స్వాతంత్ర్యమునకు నీతోడ నిప్పు
డిత్తి ముదము మీఱ మేము పోరాడు చుంట
తెలియదే యించుకయు? హిందు దేశమునకు
నగ్బరూ! చక్రవర్తి వెట్లాదు వీవు?

అక్బ — ఓ కాంతా! నీవు లోకానుభవములేని దానివలెఁ గాన్పించుచున్నావు. నేను హిందూదేశ చక్రవర్తి యని పిలిపించుకొనుచుండ నీవు చెప్పిన వారందఱును తల వంచుకొని యూరకుండిరి గదా? కారణమేమి? మాకు జడిసి యేఁగదా? ఇఁక మా సార్వభౌమత్వమునకుఁ గల లోపమేమి? ఇఁక మీరా? జైత్ర యాత్రకు బయల్వెడలి వచ్చి “కప్పమ్ముసంగెదరా యుద్ధము చేసెదరా” యని మే మడుగు వఱకును మూలనే డాఁగి యుంటిరి ఇప్పుడు యుద్ధము చేయుచునే యున్నాము. కొద్దిపాటి సైన్యము గల మీతోఁ బోరుచున్న లక్షాధిక సైన్యము గల మాకే జయము గలుగునని వేఱే చెప్పవలయునా?

రామా — ఓహో! ఇదియా నీ సార్వభౌమత్వమునకుఁ గల కారణము? ఎఱుఁగనైతి! నీవు “హిందూ దేశ చక్రవర్తి” యని పిలిపించుకొనుచుండ నితర స్వాతంత్ర పరిపాలకులెల్లఱు నూరకుండిరా? అనఁగ నీకు జడిసియా? కాదు కాదు. నీకు జడిసియే నా రట్లుదాసీనులై యున్నారని తలంచి యుప్పొంగి పోవుచుంటివి. వారి యుదాసీనతకుఁ గారణము నీవు తెలిసికొనలేక పోయితివి. చెప్పెద వినుము, పిచ్చివాని గతి వక్రము. దాని నాపుట కష్టము. వాఁడు తన యాజ్ఞ వలననే సూర్య చంద్రాదులు తిరుగుచున్నారనియు వాయువు వీచుచున్నదనియు నగ్ని ప్రజ్వరిల్లుచున్నదనియు ననును. ఇవి యవి యననేల? వాఁడీ బ్రహ్మాండమగు కాలచక్రము తన యాజ్ఞ వలననే పరిభ్రమించుచున్నదని వాక్రుచ్చును. నీ వట్టివాఁడవు. కాకున్న నందఱు తమ తమ రాజ్యములను వర్యాతంత్ర స్వాతంత్రముగఁ బరిపాలించుకొనుచుండ నీవేల హిందూదేశ చక్రవర్తి యని పిలిపించుకొందువు? తక్కుంగల హిందూ దేశపాలకులెల్లఱు నీ విషయమున నిట్లే తలంచిరి. ఆ హేతువు వలననే వారూరకుండిరి. ఇఁక మన మిప్పుడు చేయుచున్న యుద్ధము సంగతి. మా

ది కొలఁది సైన్యము. మీది లక్షాధిక సైన్యము. అగుటచే మీకే జ
యము గలుగునా? ఇది పిచ్చి యూహ. ముప్పది వేల ఫౌజు గల వారి
మీఁది కీవు లక్షాధిక సైన్యముతో దండెత్తి వచ్చితివి. ఈ సంగతియే
మీ వాహిని పరాక్రమ విహీన మని చాటు చున్నది. ఓ అక్బర్!

సీ. జలధిలో నవలీలఁ జరియించు నోడ నిం
తను ముంపఁ జిన్ని రంధ్రమ్ము చాలు
శైల సన్నిభమైన తూల రాశిని గాల్ప
నలుసంత యగ్ని కణమ్ము చాలుఁ
గడవంత గుమ్మడి కాయ ముక్కలు గాఁగ
వెనఁ జేయఁ జిన కత్తి పీట చాలు
బహుళ సత్కీర్తి విధ్వంసమ్ముగా నొన
ర్పఁగ నొక్క దుష్ప్రవర్తనము చాలు
గీ. పెక్కు అతి కష్టమునఁ గూడఁ బెట్టి నట్టి
కాసు నంత వెచ్చింప నొక్కండె చాలు
నట్లె లక్షాధిక మ్మైన యట్టి నీదు
సేనఁ బరిమార్ప మా చిన్ని సేన చాలు.

జయాపజయములకుఁ గేవల బలాధిక్యముతోఁ బనిలేదు. ఎట్టి సమయము నందును జయాపజయములను నిర్ధారణము సేయుటకు వీలు లేదు. అవి దైవాధీనములు. ఇంతయేల? ఇరువుర దళములును బోరుచునే యున్నవి గదా? మన యిరువురము గూడఁ బోరుదము రమ్ము.

అక్బ—నే సంగనా మనుజులతోఁ బోరాడు వాఁడఁ గానని యిదివఱకే చెప్పి యున్నాను.

రామా—అట్లయిన వినుము. నేను పెక్కు సార్లు నిన్ను జంపఁ బ్రయత్నించి యుంటిని. కాని యీశ్వరేచ్ఛ వేఱొక రీతి నుండుటచే

నా ప్రయత్నము లన్నియు విఫలములై పోయినవి.

నా ప్రియ వల్లభుని నీవు చంపించితివి. నా బొందిలోఁ బ్రాణము లున్న యెడల నెప్పటికైన నా నాథుని జంపించిన పగను సాధింపక పోను. కుందేలు వంటింటఁ జొచ్చినట్లు నేను మీ గుడారము జొచ్చితిని. నేను మరణమునకు వెఱచుట లేదు. నా జీవితేశ్వరుని సన్నిధికిఁ బోవలెనన్న కాంక్ష నన్ను త్వర పెట్టు చున్నది. కావున నీ భటులలో నెవనికైన నన్ను నా ప్రాణేశ్వరుని సన్నిధి కనుప ననుమతి నొసంగుము.

అక్బ—ఓ కాంతామణీ! ఇంతటి పతి ప్రేమ గలిగి నట్టియు నింతటి యనివార్య శౌర్యము గలిగినట్టియు లేమ వగు నీ మీఁద నా ఖడ్గ మెట్లాడును? నేను శూర పురుషులతోఁ బోరుదునే గాని కోమలుల కొఱకు ముల్లొయినను దాఁక నీను. వీరాధి వీరుండైన నీ పతి చనిపోయి నందులకు నాకు విచారముగనే యున్నది. అయినను నే నేమి సేయుదును? మీరు లేనిపోని గొడవలు తెచ్చి పెట్టుటచే నింత సంభవించెను. మిమ్ము మా సామంతులుగఁ జేయుట మా పని గాని చంపుట మా తలంపు గాదు. అయినను గతించిన దానికి వగచిన నేమి ప్రయోజనము? ఇప్పటికైనను మీరు నే నన్న రీతిని నాకు వశ్యులయి మెలంగవ లేని యుద్ధము నుమాని వేసి రాజపుత్రులంగఱకు నభయ మొసంగెద.

రామా—ఏమీ? మాన ధనులగు రాజపుత్ర వీరులను గూడ జాలి గలంచు చుంటివే! క్షత్రియులు నీ కంత చులకనగఁ గాన్పించు చున్నారు కాఁబోలును. అందని ఫలముల కఱ్ఱుల నేల చాచెదవు? అక్బర్! ఎన్ని తడవలు చెప్పినను నీవు మా యభిప్రాయమును గుర్తెఱుంగ నట్లు తోఁచు చున్నది. మఱల నింకొక మాట చెప్పెద వినుము.

ఉ. రాజ్యమె పోవుఁగాక, మఱి రాజ్యము కంటెను నెక్కుడైన సా
మ్రాజ్యమె పోవుఁగాక, మఱి ప్రాణమె పోవును గాక పోరగ

సజ్యము చేసినట్టి ఘన చాపము నెక్కు-ను డించి నైచిసం
పూజ్య చరిత్రులైన రస పుత్త్రులు భీతిని కప్పమిత్తురే?

అదియుఁగాక, నా కంఠములోఁ బ్రాణము లున్నంత వఱకు సిసోదియా వంశము వారిని బరులకు సామంతులుగా నుండు నంతటి నైచ్యము నకును, హాయిగ సౌఖ్యాంబుధి నోలలాడుచున్న మా ప్రజలను గ్రూరమగు మహమ్మదీయ పరిపాలనమునకును బాల్పడఁ జేయుటకు రాజపుత్త్ర స్త్రీనైన నేను సాహసింపఁ జాలనని దృఢముగ నమ్మి యుండుము.

అక్బ—ఏమీ? తురుష్క పాలనం బంత క్రూర మైనదా?

సీ. మత భేద మెన్నక మదిని హిందువుల క
　　త్యన్న తోద్యోగమ్ము లొసఁగి నాఁడ
యవన హిందూ జను లపరాధములఁ జేయ
　　నొక రీతి శిక్షించు చున్నవాఁడ
యవనుల వల్ల హైందవు లెల్లఁ బొందెడి
　　బాధల నన్నింటిఁ బాపి నాఁడ
యవనుల కున్నట్టి యధికారములు హిందు
　　జనులకుఁ గూడ నొసంగి నాఁడ

గీ. అన్యు లాత్మీయులని సుంత యైనఁ దలఁప
హిందువుల్ గొప్ప వారంచు నెఱిఁగి యుంటిఁ
దొరక పాలన మందు హిందు జను లొందు
కష్టము లవెవ్వియో సుంత కాంత చెప్పుమ.




రాణా—ఓ అక్బర్! నిష్కారణముగ నాత్మ స్తుతిఁ జేసికొనిన పాపమున కేల నొడిగట్టుకొందువు? భూపాలుఁడు తన ప్రజలను సుఖపెట్టుటయు నొక వింత యేనా?

ఉ. పన్ను లొసంగి భక్తిని సపర్యలఁ జేసెడు నెల్ల లోకులన్

చుంటివి. అట్టి నీ వెన్ని తడవలు నా చేఁ జిక్కినను శిక్షింపక విడిచి పె ట్టినాఁడను. ఈ హేతువు వలననే మీ క్రూరతయు మా సాధుతయుఁ దేట పడుచున్నవి.

రామా—ఏమి యీ వింత! మా ప్రబల విరోధి వగు నీ యుప దేశమును సమ్మతింప నంత మాత్రమున మేము క్రూరులమా? అదియుఁ గాక, మీరు సాధువులా? అద్దిరా! తురకల రాజనీతి!

సీ. వంశ పరంపరా ప్తమగు రాజ్యమ్ముతోఁ
దుష్టి లేకుంట సాధుత్వ మొక్కొ
యిచ్ఛలమ్ముగ నేలు నేల రాయని త్రోడ
దురము సేయుటయు సాధుత్వ మొక్కొ
సమరమ్మున నసంఖ్య జనుల ప్రాణములను
దొలఁగించుటయును సాధుత్వ మొక్కొ
కలన గన్గొనుచు నొక్కట నున్న నరనాథుఁ
బన్నాడుటయును సాధుత్వ మొక్కొ

గీ. చెట్ట లేకుండ రాజ్యమ్ము సేయుచుంగ
సిగిడి దండెత్తి వచ్చిన పగతుఁ దాఁకి
యుద్ధ మొనరింపఁ గ్రూరత్వ మొక్కొ! యద్దిరా! తెలియ వచ్చెఁ దురకల రాజనీతి!

అక్బ—ఇఁక విశేషించి నీతో మాట్లాడుటకు నా కిష్టము లేదు.

రామా—ఔను. అకృత్యము గావించి నప్పు డేమి చెప్పఁగలవు?

అక్బ—నేను చెప్పవలసిన మాటలు సెప్పితిని.

రామా—ఈ మాటలభిమానధనులగు వీరులు చెప్పవలసినవిగావు.

( తెరలో ఢంకా నినాదము. పిమ్మట )

ఓహో! సైనికులారా!

గీ. పద్మమిత్రుండు పశ్చిమ వార్ధిం గ్రుంకె
బలసి దిక్కులం జీకటు లలముకొనియె
నొకని నొక్కండు కాన్పింప కుండెం గానం
బోరు టింక మాని రండు గుడారములకు.

రామా—(తనలో) ఎన్ని విధములం బిల్చినను నగ్బరు పోరునకుం గడంగకున్నాఁడు. నాతోం బోరినం జచ్చుట నిజమని యగ్బ రెఱుంగును. కావుననే మగువతోం బోరం జనదని వంక పెట్టి మానుచున్నాఁడు. తురకలకు మానాభిమానములతోం బనిలేదు. అగ్బ రట్టి వాం డగుట వలననే యంత రాజ్యమును సంపాదింపం గలిగెను. ఛీ! అభిమానము లేక మహా భోగము లనుభవించు వానికన్నం బసువు మేలు! అంది నప్పుడు జుట్టు నంద నప్పుడు కాళ్లను బట్టుట తురకలకు సాజము. యవనులు ధర్మాధర్మములను బాటింపరు. తఱిమైన నప్పుడు శత్రువుల పట్ల నీచాతి నీచమగు కుటిల ప్రవర్తనము గావింతురు. శౌర్యము గల్గియున్నచోఁ గా డుచుకొని వచ్చి యో వలసినంతటి తీక్ష్ణము లగు వాగ్భల్లములచే నే నగ్బరుని నొప్పించితిని. కాని యగ్బ రెంత మాత్రమును దన సంగ్రామ భీరుతను వదలుట లేదు! ఛీ! శౌర్యము లేని పిరికి బ్రతుకు నొక్క బ్రతుకా? కానిమ్ము. ఈ తడవ వాచస్పతి నంపెద. అగ్బ రప్పుడును మా క[illegible]వ్రతమును వదల కుండునా?

(అని యందఱు నిష్క్రమించుచున్నారు)

ఇది పంచమాంకము.

శ్రీరస్తు.

# సాహసిక రాజపుత్త్రియము.

## షష్ఠాంకము.

---

[ చిత్తూరు దుర్గము ]

( కొందఱు రాజపుత్త్ర వీరులు ప్రవేశింతురు )

ప్రథముఁడు—నెచ్చెలులారా! నిస్తుల శౌర్యవంతుఁడై, సిసోదియా వంశాభరణుఁడై, ముప్పదివేల వాహినిచే లక్షాధిక సంఖ్యగల వైరి సైన్యము నొక ప్రక్కకుఁ దెచ్చిన యోధాన యోధుఁడగు మహారాజు గతించెను. మహారాజు చేయుచుండెడి సమస్త సత్కార్యముల యందును దోడు నీడవై యుండి మహారాజుతోఁ బోల్పఁదగిన మహామంత్రి వాచస్పతి గతించెను. సేనా నాయకు లెల్లఱుఁ గూలిరి. స్వదేశ మతగౌరవములను రక్షించుకొనుట కిరువది యెనిమిది వేల భారత వీరులు పూల చెండ్ల వలెఁ దమ శిరఃప్రకరమ్ములను రణరంగమున కర్పించిరి. ఇఁక మన వీరులు రెండు వేలు మాత్రము నిలిచి యున్నారు. ఇట్టి స్థితిలో మనము పోరుట కన్న నక్బరుతో సంధి సేసికొనుట మేలు గాదా?

ద్వితీయుఁడు—హర హరా! రాజపుత్త్ర వీరుని నోటనుండి యెట్టి మాటలు వెలువడినవి! ఓ చెలికాఁడా! నీ వంతయు బాగుగనే చెప్పితివి గాని తుదను మాత్రము పొరపడితివి సుమా! జగమల్ల మహారాజు మనకుఁ బరమ పూజ్యుఁడు. మేవాడు రాజ్యములోని ప్రజ లెల్లఱును నాహార

నిద్రలు మాని " మా పాలింటి పెన్నిధానమును గోలుపోయితి " మని దురపిల్లు చున్నారు. అట్టి మహారాజు నన్యాయముగ మహమ్మదీయులు సంహరించిరి వీరాధి వీరుఁడగు వాచస్పతిని గూడ నట్లే సంహరించిరి. సైన్యము నుగ్గు సేసిరి. మహారాణికిఁ దీరని దుఃఖమును గలిగించినారు. మన పగఁ దీర్చుకొనుటకైన మనము తురుష్కులతోఁ బోర వలదా? దేహములు నిత్యములా? యశస్సును రక్షించు కొనవలదా?

తృతీయుఁడు—అదియుఁగాక, ఖడ్గముఁ జేతఁ బట్టి మహారాణి మొక్కవోని ధైర్యముతోఁ బోరాడు చుండ " రాజపుత్ర వీరు " లని జగద్విఖ్యాత నామము దాల్చిన మనము పోరాడ కుండుట పౌరుషమా?

ద్వితీ—ఒక వేళ నిప్పుడీ యక్బరుతో నంధి సేసికొనినను మనము రెండు వేలు మాత్రమే గదా నిలిచియున్నారము. మఱల మనమింతలోఁ దేఱికొనఁ జాలుదుమా? మన వలనఁ గప్పముఁ గొని యక్బరు ఢిల్లీకిఁ బయనమై నంతనే మన దౌర్బల్యము నెఱింగి యెవఁడైన మనమీఁదికి దండెత్తి వచ్చిన మన మేమి సేయఁగలము? కోట తురుష్కులకు స్వాధీనమగుట నిక్కము. మన ప్రస్తుత సైన్య సంఖ్య నెఱింగి యున్న యక్బరు సైతము మనము ప్రార్థించినను నంధి కొడంబడు నని నమ్ముటకు వీలు లేదు. కావునఁ బోరుటయే మన కిప్పుడు కర్తవ్యము.

( తెరలో )

ఓ రాజపుత్త్రులారా! మీ రింక నిచ్చటనే యున్నారా?

తృతీ—( ఆలకించి ) అల్లదే మహా రాణి యిట్లు చనుదెంచు చున్నది.

( అప్పుడు రామాబాయి ప్రవేశించుచున్నది )

రామా—ఓ క్షత్త్రియ వీరులారా! ఇంతవఱకును మీరు మా సంస్థానమును రక్షించుటకుఁ గొదమ సింగముల వలెఁ బోరాడితిరి. మీ

కెల్లఱకును మా వంశము నెడలను మేవాడు రాజ్య ప్రజల యెడలను గల భక్త్యనురాగములు ప్రశంసనీయములు. మీ బాంధవులలో ననేకు లీ యుద్ధమున నిహతులైరి. ఇంత చేసినను మనకు జయలక్ష్మి దూరస్థమైనది. ఎప్పుడు నా నాథుఁడు తురుష్కులచే నన్యాయముగ సంహరింపఁ బడెనో యప్పుడే జయలక్ష్మి తనను జేపట్టు మహారాజు లేఁడని తురుష్కుల పాలైనది. ఇంతవఱకును బోరి యిప్పుడు తురుష్కులకు లోఁ బడుటకన్న రసపుత్త్ర వీరులకు హైన్యత గలదా? కావున నిరతిశయ శౌర్యముతో రణరంగమున వైరి వీరులతోఁ బోరాడుఁడు. అదియే క్షాత్త్ర ధర్మము.

ప్రధా—తల్లీ! మన మిట్లు వ్యర్థముగఁ బోరి ప్రాణములను విడుచుట కంటె నక్బరుతో సంధి చేసికొని రాజ్యమును రక్షించుట మేలు గాదా?

రామా—(అత్యాగ్రహముతో) ఏమేమీ? అక్బరుతో సంధి సేయుటా? మహారాజుని దొంగతనముగ సంహరింపించిన నీచునితో సంధి సేయుమని చెప్పుటకు నీ నోరెట్లాడెనురా? నీ పోషకుని జంపిన పగఁ దీర్చుకొనుటకుఁ బ్రాణముల నైన విడువఁ దగిన పని నీకుఁ దోఁపలేదా? ఛీ ఛీ! స్వామిద్రోహీ! రణరంగ భీరూ! నీవు నా యెదుట నుండి తొలంగి పొమ్ము.

ప్రథమేతరులు—మేము తురుష్కునితోడి సంధి కంగీకరింపము.

రామా—వహవా! అదియే పౌరుషము. మీరు క్షాత్త్ర ధర్మము నెఱింగిన వారు. శత్రుఁ డెంత మంచి వాఁడయినను మన స్వాతంత్ర్యమును హరింప వచ్చినప్పుడు వెను దీయక పోర వలసినదే గాని సంధి సేయఁ గూడదు. మా పూర్వులును మీ పూర్వులు నీ యంశము నే గమనించిరి. వారు తురుష్కులతోఁ బోర వలసి వచ్చినప్పుడు రాజ్య

ము పోయినను బ్రాణము పోయినను యుద్ధమునే జేసిరి గాని సంధి కొడంబడి యుండ లేదు. మానధనులగు వారు చూపిన మార్గమే మన కనుసరణీయము. క్షత్రియునకు యుద్ధము నందుఁ జచ్చుట పెండ్లి యాడుటతో సమానమైనది. సంధి చేసి బ్రతుకుట చావుతో సాటి.

« హతోవా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీం »

మ్మని (శ్రీ) కృష్ణుఁ డర్జునున కుపదేశించినట్లు జయింపఁ బడితి రేని వీర స్వర్గమును జూఱ కొందురు. జయించితి రేని « భూమిలోఁ జిత్తూరు దుర్గము నందలి రస పుత్త్రులే వీరులు. శూరులు. ధన్యు » లని యనంత యశ మ్మొందుదురు. సకల లైహిక సౌఖ్యముల ననుభవించెదరు.

అందఱు—మే మందఱమును మహారాణి కొఱకును మేవాడు రాజ్యము కొఱకును బ్రాణముల యందు దాశ యుంపక శత్రువ్యూహములతోఁ బోరాడి భూదేవికి రక్తాభిషేకముం గావించెదము.

రామా—అట్లయిన నిఁక నిట నిల్వఁగూడదు. వేగఁ బొండు. విరోధుల విషయమును జ్ఞప్తి యుంచుకొనుఁడు.

గీ. మించి మాన్యుని రణము గావించు చోటఁ
దురకలైనను దుద మున్టఁ బ్రుల్లనలగు
క్షత్రియాన్వయులైనను సమయ వలయు
నుభయులును బ్రాణముల తోడ నుండఁ దగదు.

అందఱు—మహారాణి యాజ్ఞ చొప్పున మే మిదే రణరంగమునకుఁ బోవు చున్నారము.

( అని జయ హర, జయ మహాదేవ యని
కోలాహలము సేయుచు నిష్క్రమించు చున్నారు )

( తెరలో )

రామసింగూ! చితులను సిద్ధము చేయించితివా?

రామా—( ఆలకించి తెరవంకఁ జూచి ) అదే నా ముద్దుబిడ్డలు క్షత్త్రియ కాంతలతో జహర వ్రతము సేయ నిర్ణీత స్థలము దెసకుఁ బోవు చున్నారు.

( అప్పుడు రామసింగు ప్రవేశించుచున్నాఁడు )

రామ—మహారాణీ! తమ యాజ్ఞానుసారము సర్వము సిద్ధము సేయించితిని.

రామా—సరిదే. నీ వేగి యుద్ధ క్రమము నడసి యుద్ధ పరిణామమును మాకుఁ దెలియఁ జేయుము.

రామ—చిత్తము. ( అని నిష్క్రమించుచున్నాఁడు )

రామా—( ముందుఁ జూచి ) నా కోడకుఁ గాఁబోలు క్షత్త్రియ కాంతలు కొంద ఱట నిలిచి యున్నారు. ( అని వారిని సమీపించి ) ఓ కాంతామతల్లికలారా! ఆనంద కంటకిత హృదయారవిందలై మన సంకేత స్థలమునకు రండు.

( అని యెల్లజతోఁ జితులను సమీపించుచున్నది )

( అప్పుడు చంద్రావతీ లీలావతులు రామాబాయి చెంతఁ జేరుదురు )

రామా—ముద్దు బిడ్డలారా! రండు. ( అని వారిని జేరఁ దీసి యెలుగెత్తి ) ఓ క్షత్త్రియ కాంతలారా! మన మిప్పు డక్షయమైన శాంతి స్థానమునకుఁ బోవ ప్రయత్నించు చున్నారము. మన మీ లోకమున ననుభవించిన సౌఖ్యములు సౌఖ్యములు గావు. వైభవములును వైభవములు గావు. లభానములగు ప్రాపంచిక సౌఖ్యములను వైభవములను మీ మనో దర్పణములం బ్రతిఫలింప నీయకుఁడు. నిర్మల భక్తితో మన యభీప్సితముల నెఱవేర్ప నా సర్వేశ్వరుని బ్రార్థింపుఁడు.

( తెరలోఁ దుపాకులు ఫిరంగులు ప్రేలిన ధ్వని )

రామా—( ఆలకించి ) అల్లదే రాజపుత్త్రులకును ఒుహుష్కులకు

సంకుల సమర మగుచున్నది. మీరు నిర్మల చిత్తముతో నుండుఁడు.

( తెరలో )

హా హా! మహారాణీ! ఆయుధములను జేతఁ బట్టి పోరుటకు శక్తి యున్నంతవఱకు మనవారు ఘోరముగఁ బోరిరి. కాని రాజపుత్త్రుల దౌర్భాగ్య వశమున జయలక్ష్మి తురకలనే వరించినది. మన వారెల్లరు నిహతులైరి. తూర్పు ద్వారము చెంతఁ బడిన పీనుఁగుల గుట్టలను దీసివైచి తురుష్కులు కొలఁది కాలములోనే కోటలోఁ బ్రవేశింపఁ గలరు. ఖడ్గ ప్రహార సంజనిత మగు బాధచే నే నింక మాట్లాడఁ జాలకున్నాఁడను. ఇఁక మీ పని మీరు చూచుకొనుఁడు.

రామా—ఓ క్షత్త్రియ వనితా మతల్లికలారా! మీ పతులును, సుతులును, నన్న దమ్ములును వీర స్వర్గము నలంకరించిరి. వారి యంశము మీయందుఁ గలదు. ఇఁక నాలస్యము సేసిన యెడల వీర కాంతలను వీర మాతలు నగు మీరు మ్లేచ్ఛులచేఁ జిక్కి దూషితలై పోదురు. తురకలకు దాసీలై యుండ వలసి వచ్చును. ధర్మ మనునది యొకటి యుండె నేని మన మా ధర్మ మార్గమునఁ జరియించితి మేని సూర్య చంద్రు లున్నంత కాలము నీ కోట సిసోదియా వంశజుల స్వాధీనమందే యుండును గాక. ఒక వేళ నెప్పుడయినఁ దురకలకధీనమయినచో నీకోట కాదుస్థితి తక్షణమునందే తొలఁగి పోవునుగాక. పతివ్రతా మణులగు రాజ పుత్త్ర కాంతలు పలు తడవలు జహర వ్రతములు సేయుటచే నతి పూతమైయున్న యీ స్థలమున దేవ బ్రాహ్మణ గో హింసా పర తంత్రులగు యవనులు స్థిర నివాసము సేర్పఱచు కొనఁ గల రేని నిముసములోఁ బుత్త్ర మిత్త్ర కళత్త్రాదులతో భస్మీ భూతులై పోదురుగాక. ఓసోదరీ మణులారా! చితుల పయి నున్న నేతి వస్త్రములకుఁ ద్వరగ నగ్ని ముట్టింపుఁడి. యగ్ని ముట్టింపుఁడి.

(తెరలో) ఇదే ముట్టించితిని.

(మతిలం దెరలో) ఢీన్ ఢీన్ ఢీన్ ఢీన్ ఢీన్.

రామా—మానవతులారా! మ్లేచ్ఛులు కోటలోఁ బ్రవేశించినారు. అగ్నిలోదూఁకుఁ డగ్నిలోదూఁకుఁడు. ఓ జ్వలనా! ఓ సర్వభక్షకా! అజ్ఞతచే మాచే నేమైనఁ బాపములు చేయఁబడియుండినచో వాని నెల్ల దహింపుము. మా యాత్మలను బవిత్రము సేయుము. ఓ సర్వదేవతాంతర సంభూతా! వీతిహోత్రా! వీరమాతలు, వీరపత్నులు, వీరాంగనలు, నిర్మలచారిత్రలు, మామకాశ్రితలు నగు నీ రాజపుత్త్ర కాంతామణులతోఁ గూడ నన్ను సకల రాజపుత్త్రులతో సంతోష లహరి నోల లాడుచున్న నా ప్రాణనాయకుని చెంతకుఁ గొనిపొమ్ము. ఓ దేవా! మమ్ము రక్షింపుము.

(అందఱు నగ్నిలో దుముకుచున్నారు)

(అంత ఢీఁ ఢీఁ అను రణఘోషముతోఁ గొందఱు తురక సైనికులు ప్రవేశించుచున్నారు)

ప్రథముఁడు—ఔరా! ఏమీ యీ మంటలు! ఒక్క రజపుత్త్రకాంతయును గాన్పింపకున్నదేమి?

ద్వితీయుఁడు—ఓరీ! నీ యాశ నిరాశగాను. ఈ వేఁడిమికి దేహమోర్వఁజాలకున్నది. మంటలు చల్లారిన తరువాత మఱల వత్తము రండు.

ప్రథ—ఔను. ఆదెనకుఁ బోయిన నొక్క క్షత్త్రియకాంతయైన దొరకును. అందఱు నగ్నిలోనే బడి చత్తురా?

తృతీయుఁడు—ఏమో మాకుఁ దెలియదు. త్వరగ నగ్నిలోదూఁకి యందలి క్షత్త్రియ కాంతల నడుగుము.

(అని యందఱు నిష్క్రమింతురు.)

(అప్పు డక్బరు మానసింహుఁడు ప్రవేశించు చున్నారు)

అక్బ—(ఆశ్చర్యముతో) ఏమి యీ మంటలు! అహా! క్షత్త్రి

పురుషుల సాహసము! ఒక పురుషుఁడైనను స్త్రీయైనను గాన్పింప

మాన—చిత్తము. సార్వభౌమా! చిత్తోడు దుర్గము సందలి రాజ త్రు లెల్లను నిట్టి బుద్ధిమంతులే. చీను చిటుక్కు మనిన నెగిరి పడెన స్వపర బలాబలముల నెఱుఁగక యెంత వారినైన నెదిరించి పోరి తు బురుషు లెల్ల సాహసమునమడిసెదరు. స్త్రీ లగ్ని ప్రవేశము గావిం అశక్తి దుర్గము లన్న నిట్టివారే.

అగ్బ—కాని మానసింహా!

చెలువడి సన్నిభమ్మగు సైన్యము గాంచి మనమ్మునందు భీ
తిలి పడిఁ గప్ప మిచ్చెదరు దీమస మొప్పఁగఁ బోర రంచు నేఁ
దలఁచితి; నంతెగాని బల ధైర్యలవమ్మునఁ గన్న గాన కే
కలన నెదిర్చి యిట్లు మృతిఁ గాంతురటంచు నెఱుంగ నింతయున్.

మాన—ఓ హిందూదేశ చక్రవర్తీ! తొలుత మనము కొంత క ప్పమును మాత్రమే కోరితిమి గాని యిప్పుడా కప్పమున కంటెఁ బెక్కురె ట్లధికాదాయము వచ్చు మేవాడు రాజ్యమే మన పాలయినది. తలవని త లంపుగా నింత రాజ్య మశ్రమముగ లభించుటఁ జూడ మీ సాధుత్వము తేటఁ బడు చున్నది. ఊరక మన మీ సిసోదియా వంశీయుల యవివేకము నకుఁ జింతింప నేల?

అగ్బ—మానసింహా! అట్లుగాదు. ఇప్పుడు మనము చూపిన శాం తమెవ్వరికిని దెలియదు. అగ్బరు క్రూరుఁడని ప్రజలు నన్ను నిందింతురు. కాని యో అంబరు సంస్థానాధీశ్వరా! పాతివ్రత్యమును రక్షించు కొను టలో హిందూ స్త్రీలతో నెవ్వరును సాటిరారు. హిందూ స్త్రీలే యు త్తమోత్తమ పతివ్రతలు. కాని హిందువులకు రాజ్యపాలనము చేతఁ గాదు.

చ. సముఁడగు భూధవుం గుఱించి సామము; మించిన వానిఁగూర్చి దా
నము; వ్యతిరేకుఁ డైన జన నాయక వశ్యుని గూర్చిచూడ భే
దము; నిటు మూఁడు శక్తులకుఁ దప్పిన దండము సేయుటెల్ల యు
క్తము; తనరాజ్యముం నృపతి కాచుకొనందగు నిట్టియుక్తులన్.

( అని యుండఁగ నిష్క్రమించు చున్నారు )

ఇది షష్ఠాంకము.

సర్వము సంపూర్ణము.

